# వైశ్యప్రబోధిని

తెలుగు మాస పత్రిక





శ్రీ వాసవి కన్యకాపరమేశ్వరి దేవి



మే 1995

## శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2–2–21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ – 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6–3–609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు – 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్థాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19–5–1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/–లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/–లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

విచ్చెనమెట్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి
ఆధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి
ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం    స్థాపితం : 1961    బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

✆ : 52262 ప్రకాశం జిల్లా.    ✆ : 3158 (S.T.D. 085195) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జ్యోతిర్‌లింగములలో రెండవది అయిన శ్రీశైలం మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. సనను 1960 సంIకు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కానర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సంIకి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నధానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినమునను, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భమునను వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పైకం మన సత్రమునకు చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క, జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

**పోలిశెట్టి సత్యనారాయణ**    **యక్కలి బాలరత్నం**

అధ్యక్షులు    మరియు కార్యవర్గ సభ్యులు    ప్రధాన కార్యదర్శి

**వైశ్య ప్రబోధిని**
(మాసపత్రిక)



**స్థాపితము**
**1969**



**సంపుటి**
**26**



**సంచిక**
**9**



**మే - 1995**



**సంపాదకులు :**
**'సంఘోద్ధారక'**
**'వైశ్యభూషణ'**
**పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి**



**ప్రాప్తిస్థానం :**
**ఫోన్ : 45025**
**వైశ్య ప్రబోధినీ**
**కార్యాలయం**
**"వాసవీ భవన్"**
**జయనగర్ కాలనీ,**
**విద్యామందిర్**
**తూర్పు భాగం**
**కడప - 516,002.**

సంపాదకీయం

# సభా "వలపక్షము"

వలపక్షం

సాధారణముగా దీనికి అర్థము పక్షపాతమని. ఒక వ్యక్తి మీద పగ తీర్చుకోవాలనే కక్షతో కూడిన భావాన్ని ప్రదర్శించడమూ పక్ష పాతమే. పగ లేకుండా సామాన్య దృష్టితో వారి వారి ఆలోచనలను పట్టి ఎదుటి.వారిని ఎక్కువ - తక్కువ అనే భావంతో చూడడమూ పక్షపాతము అని అర్థము క్రిందికే వస్తుంది.

వలపక్షానికి సరియైన అర్థము చెప్పాలంటే పై రెండవ వివరణనే పేర్కొనాలి.

"బంతిలో వలపక్షం తగదు" అనేమాట తరుచుగా వినిపిస్తూ వుంటుంది. ఈ వలపక్షము అనే పదాన్ని కొందరు "వలపక్రము" అని అంటారు. వలపక్షము అనే పదమే వాడుకలో వలపక్రముగా మారిందే తప్ప మరేమి కాదు. ఇక్కడ బంతి అంటే పంక్తి లేక వరుస అనే అర్థములో, వివాహాలు ఇతర శుభ కార్యక్రమాల సందర్భంగా జరిగే విందుల్లో భుజించేందుకు కూర్చొండే వారి వరుస.

బంతిలో వలపక్షాన్ని చూపించడము ఎంతటి తప్పో, సభల్లో వలపక్షాన్ని చూపించడం కూడా అంతటి తప్పే. అంటే సభలకు వివిధ హోదాల్లలో పిలవబడి వేదిక మీద ఆశీను అయ్యేందుకు ఆహ్వానించిన వారందరినీ ఒకే రీతిగా చూడడము. ఎక్కువ తక్కువలు కనబర్చకుండా ఉండడము.

ఈ మధ్య పలు సభల్లో ఈ వలపక్షం బహుముఖంగా కనిపిస్తూ వుంది. బెత్తెడు-జానెడు-మూరెడు-బారెడు అనే పద్ధతులలో కొలిచి మరీ మరీ విశ్లేషించి అలా వేదిక మీద ఆశీనులైన వారిని (కార్యకర్తలు ప్రత్యేకముగా ఆహ్వానించి) గౌరవించడమో లేక సన్మానించడమో జరుగుతూ ఉంది. ఇలా ఒకే సభకు పలు మందిని ఆహ్వానించి ఆ పలువురినీ పరివరి విధాలుగా వర్గీకరించి - స్థాయీ బేధాలను నిర్ణయించి సభలు జరుపుకొనేందుకు బదులుగా ఆయా కార్యక్రమాలను నిర్వహించే కార్యకర్తలు వారికి నచ్చిన లేక వారి దృష్టికి ధీటైన ఒకే రకమైన స్థాయి లేక "హోదా" లేక ఆర్థికస్థితి ముందే నిర్ణయించు కొని అటువంటివారిని వివిధ "హోదా"లలో పిలిచి సభలు జరుపు కోవడము ఔచిత్యవంతంగా ఉంటుంది. అలా కాకుండా

పలువురిని వేదిక మీదకు పిలిచి ఆ పలువురిలో ఒక్కొక్కరికీ ఒక్కొక్క స్థాయిని నిర్ణయించి ఆ స్థాయి పరిధికి భంగము కలగని రీతిలో సన్మానాలు-జ్ఞాపికలు బహూకరించడము నూటికి నూరుసార్లు సభాపక్షపాతమవుతుంది.

ఇతర సభల్లో కన్నా ఈ సభా "పలపక్షము" అనేది వైశ్యసోదరులు జరుపుకొనే సభల్లోనూ, సమావేశాల్లోనూ భాగా కనిపిస్తూ ఉంటుంది. ఈ పలపక్ష దృక్పధాన్ని వైశ్య సోదరులూ, వైశ్యసంఘాల నిర్వాహకులూ ఎంత త్వరగా మార్చుకుంటే అంతత్వరగా వైశ్య సంఘాలలో సమత్వము, సమాన భావము ఏర్పడుతుంది. వైశ్యులుకానీ, ఇతరులుకానీ తమకు సంఘాలను ఏర్పరచు కొంటూండడంలో ముఖ్యమైన, ప్రధానమైన, మౌలికమైన ధ్యేయం లేక ఆశయము ఈ సమత్వము లేక సమానత్వాన్ని సాధించడమే. మన అందరమూ సమానమే అనే భావాన్ని సర్వ వైశ్యుల్లో కల్గించడమే.

అంతేకాదు. ఒకే కార్యక్రమానికి అనేక మందిని పిలిపించి ఆ వచ్చిన వారికి ఏవి స్థాయి నిర్ణయించాలి, ఆ స్థాయీ నిర్ణయం చేసేందుకు ఏవి విషయాలను కొలబద్దలుగా తీసికోవాలి. తీసుకొన్న తరువాత ఏవి రీతులలో తాములోగా నిర్ణయించుకొన్న వారిచే పిలవబడి ఆ సభలకు వచ్చి వేదిక నలంకరించిన వారి స్థాయిలను భంగము కలుగనిరీతిలో సత్కరించాలి అని శ్రమపడేదానికన్నా, జుట్లు పెరుక్కొనే దానికన్నా వారివారి భావాలకు తగినట్లుగా వారివారికి తోచినట్లుగా హోదాలుగల వ్యక్తులను ఆహ్వానించుకొనే అలవాటు చేసుకోవడము మంచిది. ఆ విధముగా చేసుకోగలిగితే మరిన్ని ఎక్కువ కార్యక్రమాలను జరుపుకోవడానికి కూడా వీలుంటుంది

"యధార్థము లోక విరోధము"- అని ఆర్యోక్తి. అయితే లోక విరోధానికి జడిసి జరిగే పొరబాటు ఎత్తిచూపక పోవడము కూడా తప్పే. అందువల్లనే ఈ విషయము కొంత కఠినముగా కన్పించేదైనా ఈ సంపాదకీయములో చెప్పక తప్పడము లేదు. స్వకీయప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొనికానీ, వేరొకరిని వ్రేలెత్తి చూపించి నొప్పించాలన్న భావముతో కానీ వ్రాయబడింది కాదీ సంపాదకీయం.

---

ప్రముఖ కవులూ, రచయితలు శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి గారు ఈ సంపాదకీయాన్ని ఈ క్రింది విధంగా అభినందించారు.

"సుహృత్సహోదరా!" అభినందనములు. ఉభయ కుశలోపరి.

ఈ (జూన్) నెల వైశ్య ప్రబోధినిలోని మీ సంపాదకీయం సముచితంగా ఉంది. ఇంత మంచి సంపాదకీయం ఇంతకు ముందెన్నడూ ప్రచురితం కాలేదేమో? ఈ సంఘం ఇంకా వివేక విశిష్టం కాలేదని అనుకోక తప్పదు. అది వ్యాపారులైన వైశ్యుల మహాసభ. ఇంతకూ ఏదో సంఘటన మీ హృదయాన్ని బహుశా కలచివేచి ఉండాలి.

(సం.) చిటిప్రోలు కృష్ణమూర్తి
గామాలపాడు.
గుంటూరు జిల్లా.
13-7-1991.

---

1991 జూన్ వైశ్యప్రబోధినిలో ప్రచురితమైన ఈ సంపాదకీయాన్ని పలువురు పాఠకుల కోరిక మేరకు ఈ నెలలో తిరిగీ ప్రచురించాము. ఈ సంపాదకీయాన్ని అభినందిస్తూ ప్రసిద్ధకవులు శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి గారు వ్రాసిన లేఖను కూడా ప్రచురించాము.

# 1995లో జరిగిన స్థానిక సంస్థల ఎన్నికల్లో విజేతలైన వైశ్య సోదరులు

## పురపాలక సంఘాధ్యక్షులు

| | |
|---|---|
| శ్రీ కామిశెట్టి సుబ్బారావు | ప్రొద్దుటూరు, కడప జిల్లా. |
| శ్రీ వనమా సుబ్బారావు | నరసరావుపేట, గుంటూరు జిల్లా. |
| శ్రీ కూనిశెట్టి వెంకటేశ్వర్లు | మాచెర్ల, గుంటూరు జిల్లా. |
| శ్రీమతి తుర్వా విజయలక్ష్మి | చిలకలూరిపేట, గుంటూరు జిల్లా. |
| శ్రీమతి ఆలమూరి విజయలక్ష్మి | తెనాలి, గుంటూరు జిల్లా. |
| శ్రీమతి బంగారు ఉషారాణి | పాలకొల్లు, పశ్చిమ గోదావరి జిల్లా. |
| శ్రీమతి దేవత పద్మావతి | తాడేపల్లిగూడెం, పశ్చిమ గోదావరి జిల్లా. |
| శ్రీ శీలి ప్రభాకర్ | కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా. |
| శ్రీ ముక్కా దైవేందర్ గుప్త | నిజామాబాద్. |
| శ్రీ చిల్లంచర్ల చంచయ్య | మార్కాపురము, ప్రకాశం జిల్లా. |

## మండలాధ్యక్షులు

| | |
|---|---|
| శ్రీ తుమ్మల వెంకటేశ్వర రావు | గణపవరం, పశ్చిమ గోదావరి జిల్లా. |
| శ్రీ గట్టు కృష్ణయ్య | చండూరు, నల్గొండ జిల్లా. |
| శ్రీమతి కె.పద్మ | కొడియ్యాల, కరీంనగర్ జిల్లా. |

## మున్సిపల్ కార్పొరేటర్లు

| | |
|---|---|
| శ్రీమతి పద్మనాభుని అమ్మాజి | విశాఖపట్నం. |
| శ్రీ గుడివాడ జయరాం | గుంటూరు. |

**జీవిత సభ్యత్వ చందా రూ.400/-**

# దీని భావమేమి? (తిరుపతి సీతమ్మ వ్యవహారము)

పంగులూరు సీతమ్మ భూములు గవర్నమెంటు స్వాధీనము అయినది అను అభిప్రాయము పొరపాటు. Rc B1/2700 dt 30-1-95 Asst. Commisioner, endowments వారి ఉత్తర్వు ప్రకారము పంగులూరు సీతమ్మ ట్రస్టుగా పనిచేయుటకు పి.మల్లిఖార్జునశెట్టి మరియు 4గురుని తిరుపతి శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవాలయము ట్రస్టు బోర్డుగా నియమించి, పంగులూరు సీతమ్మ గారు దానము చేసిన 42-57 ఎకరముల భూమి, క్రొత్త వీధిలో ఉండు పంగులూరు సీతమ్మ సత్రమును వారి స్వాధీనము చేసినారు. పి.మల్లిఖార్జునశెట్టికి ఛైర్మెన్‌గా భూమిని కాపాడుటకు చట్టరీత్యా పూర్తి హక్కులు కలిగినవి! ఈ భూములు గవర్నమెంటు స్వాధీనము చేసికొనలేదు - అను విషయమును పంపుచూ ఆ విషయమును మీరు వైశ్యప్రబోధినిలో ప్రచురించ వలయును. ......... లేకున్న చట్టరీత్యా చర్య తీసుకొనబడును - అని సీతమ్మ ట్రస్టు జనరల్ సెక్రటరీ రిజిష్టరు పోస్టు ద్వారా ఒక లెటరును 28/4/95తో పంపివారు.

విషయమును గమనించగల సామాన్య విజ్ఞానము కలవారికి కూడ ఈ విషయములో ప్రభుత్వ అధికారులకు అధికారము కలదు అన్నది స్పష్టమగు చుండగా - "సీతమ్మ ఆస్తుల వ్యవహారము ఆం.ప్ర. దేవాదాయ శాఖ వారి చేతుల్లోకి వెళ్ళింది" - అను 1995 జనవరి వైశ్య ప్రబోధినీ సంపాదకీయము వాస్తవము కాదు అని ఆ ట్రస్టు తీర్మాణము చేయడం లోని ఔచిత్యము ఎంతటిదో పాఠకులు గమనించ గలరు. ఎప్పుడైతే దేవాదాయ ధర్మాదాయ శాఖవారు ట్రస్టీలను నియమిస్తారో అప్పుడే దేవాదాయ ధర్మాదాయ శాఖవారికి అన్ని అధికారాలూ ఉన్నట్లుకాదా! ఆ విషయములో వైశ్యప్రబోధిని వ్రాసింది వాస్తవము కాదు అనుట ఎంత సమంజసంగా ఉంటుందో ఈ ప్రకటన ఇచ్చిన వారే ఆలోచించాలి.

రాజ్యాంగ శాసనములోని 26 (సి) సూత్రము ప్రకారము శ్రీ వాసవీ దేవ్యాలయాలు డినామినేషన్ టెంపుల్స్ అనీ, ఆర్యవైశ్య ధర్మసంస్థలు డినామినేషన్ ఇనిస్టిట్యూషన్స్ అనీ, వీటి విషయములో ప్రభుత్వము జోక్యము చేసుకోరాదు. ప్రభుత్వ అధికారులు జోక్యము చేసుకొనుటకు అవకాశం ఉండురీతిగా చట్టములు చేయరాదు అని ఉండగా, తిరుపతిలోని శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవాలయమునకు ట్రస్టీలుగా నియమింపబడినామని చెప్పుకోవడము లోని ఘనతనూ, ఔచిత్యాన్నీ పాఠకులే గమనించాలి.



## అజ్ఞాత సాహితీ రత్నం

# 'ఔకు' సుబ్బరాయగుప్త

శ్రీ సల్లీన్ చక్రవర్తి శేషాచార్య హైదరాబాద్.

కం॥ కాకలు తీరిన విబుధులు
'కాకా' 'టెక్నిక్కు' చేతగాకను - బహుధా
లోకుల ముందర - లోకువ
యై, కాలము గడపు చుంద్రు - హా!
విధి మహిమన్॥

కారణాలేవైతేనేమి, గత రెండు, మూడు దశాబ్దాలలో, సాహితీ రంగములో తత్రాపి, మన తెలుగు నాడులో, వ్యాపారదృష్టి చోటుచేసి కొన్నది. ఇది బహిరంగ రహస్యమే మరి! పుట్టగొడుగుల్లా సాహితీ సంస్థలు పుట్టుకొస్తున్నాయి. వాటిలో ఒకటీ, అరా, సంకల్ప శుద్ధితో పనిచేస్తున్నా, సంఖ్యాపరంగా ఎక్కువ సంస్థలు ధనార్జనా దృష్టితోనే నడుస్తున్నాయనేది పైకి అనకపోయినా, అందరికీ తెలుసు! ఫలితంగా, సాహితీ సంస్థల యజమానులు, సాహితీ వేత్తలు, అన్యోన్యాశ్రయ న్యాయాన్ని అవలంబిస్తున్నారేమో అనిపిస్తుంది ఇంజనీర్లకూ కంట్రాక్టర్లకూ ఉండే అవినాభావ సంబంధంలాగా! ఈ పోకడ వ్యక్తిపరంగా కొంతమేర లాభదాయకం గావచ్చు. కానీ, ప్రచారమంటే గిట్టని, ఎందరో ప్రతిభావంతులైన, ఉద్దండ పండితులు మహాకవులు ఎందరో మరుగున పడిపోతున్నారు! అలా పోయిన వారు, పోకున్నా ఎక్కడో అజ్ఞాతంగా వున్న మేధావులు ఎందరో మహానుభావులు! వారి వారి ప్రతిభా వ్యుత్పత్తులను గుర్తించక పోవడం, సమాజంలో వారికి సముచిత స్థానం ఇవ్వక పోవడం వారి తప్పు కాదు. ఖండితంగా మన సాహితీ సమాజానిది. కాదంటారా? మనవి చేసికుంటా.

కర్నూలు జిల్లాలో, నంద్యాలకు దగ్గరగా 'ఔకు' అనే ఒక గ్రామంలో (అది ఒకప్పుడు చిన్న సంస్థానం!) "బచ్చు సుబ్బరాయ గుప్త" అను గీర్వాణ భాషా పండితుండే వాడు. వారి పేరు ఈ యువతరం వారి సంగతి వదిలేద్దాం. పాత తరం వారిలో కూడా ఎంత మందికి తెలుసు? కారణం? ఆధునిక కాలంలో అవసరమైన 'పబ్లిసిటీ' కళలు బొత్తిగా వంటబట్టని పాతకాలం మనిషి కావటమే!

"నిక్కమైన మంచి నీలమొక్కటి చాలు
తళుకు బెళుకు రాళ్లు తట్టెడేల"

అని వేమన అన్నట్లు (ఆ మాట కొస్తే విదేశీయుడైన బ్రౌన్ దొరగారి చలవ లేకుంటే వేమన కవుల కోవలో చేరియుండేవాడు కాదులెండి!) శ్రీ బచ్చు సుబ్బరాయగుప్త గారు మంచి నీలమే కాదు. జాతి వజ్రము! వారు రచించిన ఇతర గ్రంథాలేవైనా ఉన్నాయేమో నాకు తెలియదు. నా సుకృతము కొద్దీ, కొద్ది

సుకృతము కొద్దీ, వారి కృతి ఒక్కటే నాకు లభించింది. అదీ, ఫుట్‌పాత్ పుస్తక భాండాగారంలో! దుమ్ముకు, ధూళికి, శిథిలావస్థలో చేరిన పాత పుస్తకం. దీనిని జనవరి 1963లో 500 కాపీలు ముద్రించినట్లు తెలుస్తుంది. కేవలం అట్టమీద బొమ్మతోనే అమ్ముడు బొయ్యే ఈ అధునిక కాలంలో ఇలాంటి గ్రంథాలు మలి `ముద్రణకు నోచుకొని యుండక పోవచ్చు! ప్రస్తుత కాలంలో, పండితులుగా, మహాకవులుగా ప్రచార పటాటోపంతో చలామణీలో వున్న వారికి అర్థంగాని శ్లోకాలు. మహానుభావులు ఎందరో ఉన్నారు! వారికి శతకోటి వందనాలు.

అంతకు ముందు ఎప్పుడో, మైసూరు ఆస్థానంలో రామశాస్త్రి గారనే మహాపండితుడు ఇలాంటి శ్లోకాలు వంద వ్రాయాలని సంకల్పించి, అతి ప్రయాసతో, ఏబది శ్లోకాలు వ్రాయగలిగినట్లు అంతటితో చేతగాక 'స్వస్తి ప్రజాభ్యాం' పలుకుతున్నానని, మిగతా ఏబది శ్లోకాలను వ్రాసి తన ప్రతిజ్ఞను నెరవేర్చిన మహాను భావునికి సహస్ర వందనాలు అర్పిస్తానని ఈ క్రింది శ్లోకంలో సవినయంగా సూచించి ముగించారట.

"అన్యానై: శతకాత్ కృతి స్వయమియం
గూఢార్థ పద్యైర్యుతా
కర్తవ్యేతి ప సంవిద వ్యతి చిరశ్రాంతో
మతి క్షోభిత:
విశ్రాంతో స్త్వవశిష్టమర్థశతకం
సంగ్రధ్యమత్వం విదా
సార్థం య: పరిపూరయేత్కృతి మిమాం
తస్మై సహస్రం నమ:"

అందుచేత తన గ్రంథానికి శ్రీ గుప్త గారు 'అభినవ ' సీతారావణ సంవాదఝురి' అని నామకరణము చేశారట. ఇక ఈ గ్రంథములోని విశిష్టతను ముచ్చటించు కుందాం.

రావణాసురుడు సీతాదేవితో, మూడు పాదములలో తనను గూర్చి గొప్పగా చెప్పుకొనుచు, శ్రీరాముని గూర్చి పరిహాసముగా, పరుషముగా, తృణీ కారముగా, తూలనాడు తాడు. ఇక మిగిలింది ఒకే ఒక్క పాదం! ఆ పాదంలో సీతాదేవి క్లుప్తంగా ఒకటి రెండు మాటల్లో ప్రత్యుత్తర మిస్తుంది. ఈ ప్రత్యుత్తరమే శ్లోకానికి మణిపూస! కవిగారి అనన్య సామాన్య ప్రతిభ, ప్రయాస ప్రస్ఫుటిస్తాయ్. ఆ సమాధానంలో రెండు అర్థాలుంటాయి. ఒకటి సామాన్యార్థం, 'ఓ నీచుడా! నీ మాటలు ఇంపుగా లేవు' అనియో "నీ పలుకులు మూర్ఖులకు మాత్రమే హితమైనవి" అనియో, "నీ మాటలు సుజనులు మెచ్చరు" అనియో ఇలా వుంటాయ్. ఇకపోతే ఆ పదాలలో మరొక గూఢార్థము ఇమిడి యుంటుంది. "నీ వాక్యములో ఫలానా అక్షరము తీసివేస్తే బాగుంటుంది" అనియో (చ్యావితాక్షరీ విచిత్రమట) "ఫలానా అక్షరము తీసి ఫలానా అక్షరం ఉంచితే బాగుంటుంది" అనియో గూఢార్థం (ప్రతిదత్తాక్షరీ విచిత్రమట) ఉదాహరణకు 'క' కారం తీసి 'న' కారం పెట్టుకుంటే బాగుంటుంది. ఆ విధంగా శ్లోకాన్నంతా అన్వయించుకొని

చదువుతూ పోతే రావణుడు చేసిన ఆత్మస్తుతి రావణ నిందగా, రామనింద రామస్తుతిగా మారి అంతా రావణునికే తిరిగి ఎదురుదెబ్బగా తగులుతుంది. వ్యాస విస్తర భీతితో, రెండు, మూడు శ్లోకాలు మాత్రం వివరిస్తా ఇది కొంత మందికి 'బోరు' కొట్టవచ్చు. క్షమించాలి.

1. "భూజాతే లసమాన విగ్రహయుత: సీతే హ్యలర్కోపమ:
భర్తాతే వికల స్వర స్వవదనో యుద్ధేచల శ్రీవృత:
నిష్ణాతో లలనానురూప తను సంయుక్తో స్త్వ్యహం
వాక్తే పాప సదావితేతి సుజనా: కే న్యబ్రువంతి క్షితౌ"

ఇది 'చ్యావితాక్షర' విచిత్రం. రావణు డంటాడట.

భూజాతే = ఓ సీతా, నీ రాముడు; అలసమాన విగ్రహయుతుడు = ప్రకాశించని శరీరము గలవాడు. అనగా మొరటు శరీరం గలవాడు.; అలర్కోపమ: = పిచ్చికుక్క వంటివాడు.; వికల స్వరవదన: = నోరెత్తి మాటలాలేని వాడు.; చల శ్రీవృత: = చలించిన సంపదగలవాడు, అనగా సంపద విహీనుడు.

ఇక నేనో

అహం = నేను; పాలనే నిష్ణాత: = పరిపాలనా దక్షుడను; లలనాను రూప తను సంయుక్త: = స్త్రీలకు మనోహర సౌందర్యముతో కూడిన వాడను.;

ఇక సీత సమాధానం

1. సామాన్యార్థం : పాప = హే పాపీ!; తేవాక్ = నీ మాటలు; సర్వేసుజనా:అపి = సర్వజనులకు; సదా = ఎల్లప్పుడు; ఆవిలా = కలుషితమైనవి.

2. గూఢార్థం : సదా పాప = సర్వ కాలముల యందును పాపీ!; తవవాక్ = నీ మాటలు; వి 'లా' = 'ల' కారము లేనివి.

పర్యవసానముగా 'ల' కారము తీసివేసి శ్లోకము చదివినచో

శ్రీరాముడు అ(ల) సమాన విగ్రహయుతుడు అ(ల) ర్కోపము = అనగా సూర్యుని వంటి తేజస్సు గలవాడు; విక(ల) స్వరవదన: = ప్రకాశించు కంఠ ధ్వని కలవాడు అని అర్థం.

రావణుడు (లల) నాను రూపతను సంయుక్తుడు = రూపములేని, అనర్థ శరీరము గలవాడివి; పా(ల)నే నిష్ణాత: = మద్యపాన నిష్ణాతుడు!

'ల' తీసేస్తే చ్యావితాక్షర విచిత్రం ఎంత రమ్యంగా మొదటికే మోసం వచ్చిందో చూశారా!

(2) ప్రతి దత్తాక్షరీ విచిత్రం

"అసునాథస్తు ధరాసుతే వికలసత్తేజాశ్చ - జానామ్యహం
నసురాపాలకసత్పరాక్రమ ఇతి ప్రఖ్యాతి మాత్ర: కిము
అపికాంత్యా కలయా వృతో హమయి మాంజానాసి సీతేనకిం
ఖల రేలం త్యజ వాదమే తమఖిలం కం వాపి మాజల్పతాత్"

ఈ శ్లోకంలో 'క' కారము తీసినను 'ల' కారము లోపించినను లేదా 'కల' అను రెండు అక్షరములు తీసినను, వ్యతిరేకార్థ మేర్పడి రావణ నిందగా, రామస్తుతిగా మారును.

రావణోక్తి (రామ నింద)

ధరా సుతే = ఓ సీతా; అసునాథ: = నీ పతి; వికల సత్తేజా: = శిథిలమైన పరాక్రమము గలవాడు; ఇతి = అని

అహం = నేను; సురాపాలక సత్పరాక్రమ: = దేవతలను రక్షించు పరాక్రమము గలవాడను; అపి = మరియు; కాంత్యా = కాంతితోడను; కలయా = విద్య చేతను; ప్రఖ్యాతిం = కీర్తిని; నాత్త:కిము = పొందినవాడను గానా?; వృత ఇతి = వీటితో కూడిన వాడనని; జానాసి కిం = తెలిసి కొన లేదా!

సీతా ప్రత్యుక్తి

రేఖల = ఓ ఖలుడా; అలం = చాలును, ఇక చాలు; ఏత మఖిల వాదం = ఈ వాదమంతయు; త్యజ = వదలుము; కంవాపి-మాజల్పతాత్ = ఎట్టి వాదము చేయకుము.

సంకేతార్థము

లం = 'ల' కారము గాని; కం వా = క కారము గానీ; క మపివా = 'ల' కార 'క' కారముల రెంటిని గానీ; త్యజ = వదలుము.

పర్యవసానంగా - (1) ల కారం లోపిస్తే

అసునాథ: = నీ ప్రాణేశుడు; విక(ల) సత్తేజా: = ప్రకాశించు పరాక్రమము గలవాడు; అహం = నేను; సురాప: అకసత్ పరాక్రమపి = కల్లు త్రావు వాడను; ఉజ్వలముగాని పరాక్రమముగల వాడను; అపిచ = మరియు; కయా కాంత్యా వృతం? = ఏమి కాంతితో కూడిన వాడను? (ఏమీ కాంతి లేదు అని వ్యంగ్యము)

(2) క కారము లోపించిన

అసునాథ = నీ పతి; విలసత్తేజా: = ప్రకాశించు పరాక్రమము గలవాడు; అహం = నేను; సురాపాల సత్పరాక్రమ: = సురాపానము నందు మంచి పరాక్రమము గలవాడను; అపిచ = మరియు; కాంత్యాపి = ప్రకాశము యొక్క; లయావృత: = నాశముతో కూడిన వాడను.

(3) క, కార, ల కారములు రెండును లోపించిన

అసునాథ: = నీ పతి; అవి (కల) సత్తేజా: = సూర్యుని వంటి తేజస్సు గలవాడు; అహ: = నేను; సురాప: = సురాపాయిని; అసత్పరాక్రమ: = పరాక్రమ రహితుడను; కాంత్యాయా (కల) వృత: కాంతి+ఆయ+అవృత: = కాంతి లాభములతో కూడని వాడను.

ఈ విధముగా మూడు రకాలుగా (1) - ల (2) - క (3) - క, ల వ్యంగ్య, శ్లేషలతో, శ్లోకాన్ని నడపించుట అవితర సాధ్యమని, పాఠకులు అంగీకరింపక పోరు.

మరొక శ్లోకం మాత్రం వివరించి ఈ వ్యాసం ముగిస్తా.

"భర్తుస్తే సుకృతస్య నిత్యల వనం బృందం
కృతీవాం స్మరే:
సీతే భువ మహంతులా విరహిత:
త్వరం మాం జానాసి కిం
పుర్యాం మేహి సదాలయస్య సుకృత
లగ్నం త్వదీ యాగమాత్
పాపాత్మన్ తవ వాగలాభ కలితా రేవామ
వర్ణావృతా"

పై శ్లోకంలో, 'ల' తీసి 'భ' పెట్టినను; లేదా 'మ' ఉంచినను, రావణస్తుతి రామనిందగను, రామనింద స్తుతిగను మారి రావణాసురునకే ఎసరు పెడుతుంది.

రావణుడు

సీతే = ఓ సీతా!; తే భర్తు = నీ పతియొక్క; కృతీవాం బృందం = పనుల సమూహం; సుకృతస్య లవనం = పుణ్యమును నతికి వేయు నది; (తాటక వధ; బ్రాహ్మణుడైన పరశురాముని హరించుట వంటివి)

అహం = నేను; తులా విరహితుడను = సాటిలేని వాడను; సదాలయస్య = సత్పురుషులకు ఆశ్రయమిచ్చిన వాడనైన; మే = నా యొక్క; పుర్యాం = పట్టణమందు; త్వదీయ ఆగమాత్ = నీ రాక వలన; సుకృత లగ్నం = పుణ్యం సంప్రాప్తించినది.

సీత జవాబు

వామ వర్ణావృతా = నీచాక్షరములతో కూడిన; తేవాక్ = నీ మాటలు; అలాభ కవితా = లాభము లేనిది; అని సామాన్యమైన అర్థం.

గూఢార్థం

అ 'లా' = 'ల' కారము లేనిది; 'భ' కవితా = 'భ' కారముతో కూడినది; వా = లేదా; 'మ' వర్ణావృతా = 'మ' అను అక్షరముతో కూడినది.

పర్యవసానంగా - 'ల' తీసేసి 'భ' వుంచితే

తే భర్తు: = నీ భర్త; కృతీవాం బృందం = కార్య సమూహం; సుకృతస్య = పుణ్యమునకు; నిత్యభవనం = శాశ్వత స్థానము; అహం = నేను; భావి రహిత: = కాంతి హీనుడను; సధాభయస్య = ఎల్లప్పుడు భయము కలవాడను; మే = నా యొక్క; పుర్యాం = పట్టణమందు; త్వదీయాగమాత్ = నీ (సీత) రాక వలన; సుకృతం భగ్నం = పుణ్యము నశించినది. అదే విధముగా 'ల' తీసేసి 'మ' ఉంచినచో

నీ పతి కార్యములు పుణ్యమునకు నిత్య మవనం = ఎల్లప్పుడు 'రక్ష' అని అర్థం. అహం = నేను; 'మా' విరహిత: = సంపద లేని వాడను; సదామయస్య = నిరంతర రోగిని; మే = నా యొక్క; పుర్యాం = పట్టణములో; సుకృతం మగ్నం = పుణ్యము అదృశ్యమై పోయింది.

ఇది 'లోపైక వర్ణ వర్ణద్వయారోపణ రూప ప్రతి దత్తాక్షరీయట' కష్ట సాధ్యము. చాతుర్యాతి శయ ద్యోతకము.

వర్తమాన కాలములో ఇంతటి క్లిష్ట విచిత్ర ప్రౌఢమైన ఉత్ర్పాస కావ్యము వ్రాసి పండిత లోకంలో సెబాసనిపించుకొన్న మహానుభావుడు శ్రీ బచ్చు సుబ్బరాయగుప్త కవిగారు. 'కీర్తి' శేషుడు గాకుండానే కీర్తి శేషుడు కావటం మన దురదృష్టం. వీరు పేరుకు తగినట్లు 'గుప్త' కవిగానే నిలిచి పోయారు!

# పుష్పగిరి మహాక్షేత్ర ఆర్యవైశ్య అన్న సత్రం స్వర్ణోత్సవము

కడప జిల్లా లోని ప్రధాన పుణ్య క్షేత్రాలలో ఒకటైన పుష్పగిరి లోని ఆర్యవైశ్య అన్న సత్రం స్వర్ణోత్సవము 2-5-1995వ తేదీన సదరు అన్న సత్ర భవన ఉపరి భాగముపై జరిగింది. అనాటి సాయంత్రం 4.30 గంటలకు జరిగిన ఈ స్వర్ణోత్సవ సభకు శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం అధ్యక్షులూ, ప్రొద్దుటూరు పుర ప్రముఖులూ శ్రీ జూటూరు రమణయ్య గారు అధ్యక్షత వహించారు. ప్రొద్దుటూరు పురపాలక సంఘాధ్యక్షులూ, శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలూ, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ అధ్యక్షులూ, 'ప్రజాబంధు', 'దానశీల' శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు ఈ సభలో ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. కడప ఆర్యవైశ్య సంఘం అధ్యక్షులు శ్రీ సోమిశెట్టి వెంగయ్య గారు కూడ వేదికను అలంకరించారు. ప్రసంగాల అనంతరము ఈ సత్రం సహాయ కార్యదర్శి శ్రీ మదళ్ళపల్లె సుబ్బరాయుడు శ్రేష్ఠి గారు సభాధ్యక్షులు శ్రీ రమణయ్య, ముఖ్య అతిథి శ్రీ సుబ్బరావు, శ్రీ వెంగయ్య గారలను ఘనంగా సన్మానించారు. ఈ సత్ర నిర్వహణకు భూరి విరాళంగా రూ.25,116/-లు ఇచ్చిన యర్రగుంట్ల వాస్తవ్యులు శ్రీ తాతా నరసింహులు శ్రేష్ఠి, వారి సతీమణి శ్రీమతి - లక్ష్మీదేవమ్మ గారలను కూడ ఈ సభలో ఘనంగా సన్మానం జరిగింది. ప్రధాన కార్యదర్శి శ్రీ నిచ్చెనమెట్ల అప్పయ్య శ్రేష్ఠి గారు వందన సమర్పణ చేశారు.

అంతకు ముందు సాయంత్రం 3 గంటలకు ఈ సత్రం సర్వ సభ్య సమావేశము జరిగింది. మదళ్ళపల్లె సుబ్బరాయుడు గారి ప్రార్థనతో ప్రారంభమైన ఈ సమావేశము స్వర్గస్తులైన శ్రీ నిచ్చనమెట్ల శ్రీరాములు గారి స్థానములో వారి కుమారుడు శ్రీ అప్పయ్య శ్రేష్ఠి గారిని ఈ సత్రానికి ప్రధాన కార్యదర్శిగా ఎన్ను కొన్నారు. కీ॥ శే॥ శ్రీ రాముల గారి ఆత్మ శాంతిని కోరుచూ మూడు నిముషములు మౌనం పాటించారు.

## కృతజ్ఞతలు

తమ భీమరథ శాంతి ఉత్సవాన్ని పురస్కరించుకొని, కర్నూలు జిల్లా బేతంచర్ల గ్రామ ప్రముఖులు శ్రీ గుండా మాణిక్యం శ్రేష్ఠి గారలు ఈ పత్రికకు రూ.116/-లు విరాళంగా పంపారు. వీరికి మా కృతజ్ఞ తాంజలులు.

# నేను, నాదేశం

(మార్చి సంచిక తరువాయి)

## జైలుకోడ్‌లో కాంగ్రెసువారి మార్పు

ఈ సందర్భంలో ఒక ముఖ్య విషయాన్ని వ్రాయాలి. కాంగ్రెసు మంత్రివర్గం అధికారంలో వుండగా [1936-39] బ్రిటీషు రాక్షసుల అమానుష జెయిలు కోడులో మరి ఒకటి, రెండు అమానుషమైన మార్పులు చేశారు. జెయిల్లో వుండగా నిరశనవ్రతం చేసి, చస్తామనేవారిని చావనివ్వాలి; కాని, జీవించేలా ఎంత మాత్రమూ సహాయం చేయకూడదనే మార్పు ముఖ్యమైనది. హిందీ భాషకు వ్యతిరేకంగా పనిచేస్తున్న అభివృద్ధి నిరోధకులను భయపెట్టి లొంగ దీయుటకు ఈ మార్పును చేసి వుంటారు. అయితే కాంగ్రెసు వారు అప్పుడు [1940-41లో] అధికారంలో లేరు. శ్రీ భయంకరాచారిగారు నిరశనవ్రతం చేశారు. ముందుగా మేము ఒక అంచనా వేసుకొని 21 రోజుల వరకూ యీ వ్రతాన్ని సాగించాలనీ, ఈలోగా ప్రజలు అలజడి పుట్టి, ఒత్తిడి తెచ్చి, ప్రభుత్వాన్ని లొంగ దీయ గలరని అందరం కలిసి తీర్మానించు కొన్నాము. ఆచారిగారు ఒకప్పుడు అండమానులో చాలా రోజులు నిరశన వ్రతం చేసి అనుభవం సంపాదించినందున, యిరవై ఒక్క రోజుల వరకూ ప్రాణాపాయం లేకుండా ఎలా జరపాలో చక్కగా ఉపాయాలు బోధించారు. ముఖ్యంగా నీళ్ళను సమృద్ధిగా త్రాగుచుండాలని సలహా యిచ్చారు. వ్రతం ప్రారంభం కాగానే తాను మాత్రం యీ సూత్రాన్ని ఉల్లంఘించి నీళ్ళు త్రాగక మూడు రోజుల్లోనే చావు బ్రతుకుల స్థితికి లోనయ్యారు. అప్పుడు జైలు సూపర్నెంటు డాక్టర్ మేజరు గిల్లు తగవుల మారికాదు. అందరికీ అనుకూలంగా ఎలాగో సవరించుకొంటూండే వారు. భయంకరాచారి గారి మీద ప్రత్యేకాభిమానం ఆయనకు.

కాంగ్రెసు చేసిన మార్పు అమలులో వుంది. ఆ ప్రకారం చేస్తే భయంకరాచారికి ప్రాణాపాయం తప్పదు. రూల్సును ఉల్లంఘించి బ్రతికే లాగు సహాయం చేస్తే తన ఉద్యోగానికి భంగం కలుగవచ్చు! ముఖ్యంగా తాను త్వరలోనే ఇన్‌స్పెక్టరు జనరల్ అవుతాననే నమ్మకంతో ఎదురు చూస్తున్నారు. డాక్టరు పట్టాభి, సాంబమూర్తి, కాళేశ్వరరావు, మాధవమీనన్, నాడార్, కళావెంకట్రావు, సంజీవరెడ్డి, ఆచార్యరంగా వగయిరా కాంగ్రెస్ నాయకులతో తన కష్టాన్ని మేజరు గిల్లుగారు చెప్పుకున్నారు. ఎలాంటి సలహాగాని ఇవ్వలేకపోయారు మన నాయకులు. చివరకు తానే ఒక నిర్ణయానికివచ్చి "ఏమయినాసరే, భయంకరాచారివి జీవించేలా చేస్తాననా్నరు. బలవంతంగా ఆసనంద్వారా నీళ్ళు ఎక్కించారు. 20 రోజులు నిరసనవ్రతం

పాగించారు. కాంగ్రెస్ మంత్రివర్గం చేసిన మార్పుకు అందరికీ చాల అసహ్యం కలిగింది.

## భయంకరాచారి

భయంకరాచారి అలా ఎందుకు చేశాడో తెలుసుకోవాలని కుతూహలం కలుగ వచ్చు. వారి మనస్సులో ఏముందో మాకు తెలియదు. తన మీదనే ప్రజల దృష్టి నిలవాలని, తనవల్లనే జయం వచ్చిందని గర్వపడడానికి యెత్తు వేసి వుంటారనీ అనుకున్నాము మేము.

ఆ రెండు సంవత్సరాలకాలంలో మరొకరితో కలసి ఆయన ఏపని కాని చెయ్య లేకపొయ్యాడు. భయంకరాచారి గారికి తన గదిలోకి రెండవ వారు లభించ లేదు. అలాగే కష్టపడుచున్న కాళేశ్వరరావు పంతులుగారే చివరకు భయంకరాచారిగారి గదిలో వుండవలసి వచ్చింది.

## విభజించి పాలించడం

నిరశనవ్రతం పరిష్కారమైంది, కాని ప్రభుత్వం మరొక తగాదా తెచ్చిపెట్టింది. పరిష్కారంలో సామ్రాజ్యవాదుల విషం నిండివుంది. రెండు తరగతులనే విభజనను అలాగే వుంచారు. "విభజించి పాలించడం" అనేది ఎక్కడికి పోతుంది? అయితే విభజనను ఏ పార్టీకూడా ఒప్పుకోలేదు. మామూలుగా అంతవరకూ కలిసి వుంటున్నట్టే ఉమ్మడిగా కమ్యూను జీవితపద్ధతిని నడుపుదామని మెజారిటీ తీర్మానించింది. ఒకటవ తరగతిలోని ప్రతి డెటెన్యూకు రోజుకు షుమారు నాలుగు అణాల వెలగల వెన్న, పండ్లు, చక్కెర యిచ్చారు. మొదటి తరగతిలో 25 మందినీ, రెండవతరగతిలో 85 మందినీ వేశారు. కాంగ్రెస్‌వారిలో మొదటి తరగతి వారు పదిమంది మాత్రమే, రెండవ తరగతివారు చాలాఎక్కువ.

## కాంగ్రెసు నాయకుల "ప్రత్యేకత"

తరగతివారీగా రెండు వంట శాలలు ఉండాలని శ్రీ కాళేశ్వరరావుగారి వాదన; అయితే ఈ వాదన వోడిపోయింది. పోతేనేం? అందరకు కలిసి ఒకటే వంటశాల ఉండవచ్చు; కాని, ఒకటవ తరగతివారికి అధికంగా వచ్చేవి ఎవరివి వారికే యివ్వాలని శ్రీ వారు పట్టుపట్టి వాదించారు. కాని మిగతావారు అందుకు ఒప్పుకోలేదు. ప్రత్యేకంగా ఒక వంటశాల పెట్టుకొనుటకు ఉత్తరు విమ్మని శ్రీ రావుగారు సూపర్నెంటుగారైన మేజర్ క్లైమెన్స్ గారిని అడిగారు. రెండవ తరగతిలో వుండే కాంగ్రెసు వారందరిని తమతో కలిసి వుండమని కమ్యూనిస్టులు ఆహ్వానించారు. అందుకు కాంగ్రెస్ నాయకులు నైతికంగా తిన్న దెబ్బ ఇంతా అంతా కాదు. కాంగ్రెస్‌వారి అనుచరులు చాలమంది కమ్యూనిస్టుపార్టీలో మరి ఏ వాదన అవసరం లేకుండానే చేరిపోసాగారు. చివరకు మేజర్ క్లైమెన్స్ రెండో వంటశాల పెట్టుకొనుటకు అనుమతి యివ్వనేలేదు. అందుకాయన శ్రీ పంతులుగారితో చెప్పిన కారణం ఎంతో సమంజసంగా వుంది.

"మీరు మంత్రివర్గంలో వుండి రాష్ట్రాన్ని పాలించారు; మళ్ళీ పాలించ వలసి వుంటుంది. మీ గౌరవాన్ని మీరు

కాపాడుకోవాలి. రెండో వంటశాల పెట్టు కున్నారా, మీకు కళంకం తప్పదు. భావిలో మీకు హాని జరుగుతుంది. కాబట్టి, నేను అంగీకరించను" అన్నారు సూపర్నెంటు. శ్రీ కాళేశ్వరరావుగారు పట్టి చేతులతో వచ్చేశారు. కాంగ్రెస్ నాయకులలో శ్రీ సాంబమూర్తిగారు, శ్రీ కాళేశ్వరరావుగారు పంతులుగారిని ఈ విషయాలలో బాగా మందలించుతూ వచ్చారు.

## పరారీ

జైలు జీవితం చాల దుర్భరమైనది. అందరూ ఓర్చుకోలేరు. ఐదుగురు కమ్యూనిస్టులు జైల్లోనుండి తప్పించుకు పోయారు. ప్రహరీగోడ నేల మట్టానికి సమీపంలో రెండు మూడడుగుల వెడల్పుం టుంది. కొందరు గోడకు ఒక కన్నంచేసి ఒక నెలరోజులు కనపడకుండా మూసిపెట్టి వుంచారు. ఎ.కె.గోపాలన్ నలుగురిని వెంట బెట్టుకొని తప్పించుకొని వెళ్ళిపోయాడు.

గోపాలన్‌కు బ్రిటిష్ ప్రభుత్వంమీద అమితద్వేషం. బయటి కెళ్ళి పని చెయ్యాలని గంపెడంత ఆశ. జైలులో ఎల్లప్పుడు అధికారులతో తగవులు పెట్టుకొనేవాడు. అధికారులకు గానీ, డెటిన్యూలకు గానీ విరామముండదు. అప్పుడు జైల్లో రెండు వందలమంది డెటిన్యూలలో ఎ.కె.గోపాలన్, డాక్టరు ✦కృష్ణగార్లు గొప్ప వ్యక్తులు. వీరివల్ల కాంగ్రెస్ వాదులు కమ్యూనిస్టులుగా మారిపోతున్నారని కొందరు నాయకులకు కడుపుమంట. వీరిద్దరి మీద గవర్న మెంటుకు రహస్యంగా రిపోర్టును ఒక కాంగ్రెస్ నాయకుడు పంపించాడనీ, ఛీఫ్ సెక్రటరీగారైన శ్రీ కొంతి రామమూర్తి గారు రిపోర్టు పంపిన నాయకుని ప్రవర్తనను అసహ్యించుకున్నారనీ తెలిసింది. స్వరాజ్యం కోసం ప్రయత్నించే రెండు పార్టీలలో, ఒకపార్టీ మరొక పార్టీమీద చాటు అర్జీలు పెడుతున్నందుకు రామమూర్తి గారు ఏవగించు కున్నట్టు నేను విడుదలైన తరువాత శ్రీ సూర్యనారాయణరావు గారు [సర్వెంట్స్ ఆఫ్ ఇండియా ] నాతో చెప్పారు.

పై రిపోర్టుల వల్ల డాక్టరు కృష్ణగారితో, ఎ.కె. గోపాలన్ గారితోను మద్రాసు జైలుకు ఉదయాన వెళ్ళాలని, ముందు రోజు సాయంత్రమే జైలు అధికారులు చెప్పివేశారు. ఆ రాత్రే ఎ.కె. గోపాలన్, కొరపాటి పట్టాభిరామయ్య, సి.వి.కె.రావు, దాట్ల సూర్యనారాయణరాజు (తణుకు), కన్నన్ గార్లు తప్పించుకొని వెళ్ళి పోయారు. పట్టాభిరామయ్యగారు జైలుకు వచ్చినందుకు చాల విచారపడేవారు. వచ్చినప్పటినుంచి తప్పించుకొనిపోవు టకు ప్రయత్నాలు ప్రారంభించారు. అలాగే రాజుగారూను. ప్రతిరోజు బాటలు, రోడ్లు వగయిరా గీతలు గీస్తూండేవారు.

---

✦ డాక్టరు కృష్ణ 1949 జనవరిలో స్వగ్రామం విడుబ్రోలులో చనిపోయిరి. 15 సంవత్సరాలు ఇంగ్లాండు, అమెరికాలలో చదువుకొంటూ పనిచేస్తుండేవారు. హార్వర్డ్ యూనివర్సిటీలో ఈ మేధవితో బాధలు పడలేని ప్రొఫెసర్లు ఆయనకు Ph.D. డిగ్రీ యివ్వకుండా అడ్డుపడ్డారు. చివరకు ఆయననుండి తప్పించుకోవడం మంచిదని డిగ్రీ లిచ్చి పంపి వేశారు. కృష్ణగారు మహామేధావి.

వెళ్ళేటప్పుడు రహస్యాన్ని సి.వి.కె. రావు గారితో చెప్పి, తమ తరపున మిగతావారందరికీ ముందుగ చెప్పనందుకు క్షమాపణ తెలుపుమనికోరారు. "నేనుకూడా వస్తానని ఆయనకూడా దూరిపోయారు.

మరునాడు జైలులో గందరగోళమయింది. అంతవరకు రాత్రిళ్ళు మేము ఆరుబయట పడుకొంటూండేవాళ్ళం. ఆ సౌకర్యం పోతుందని తప్పించుకొని పోయిన వారిని పెద్దలు కొందరు నిందించసాగారు. అయితే కమ్యూనిస్టులను మాత్రమే మూసివెయ్యాలని ఉత్తరువు వచ్చినా, కోన సీమ కాంగ్రెస్ నాయకుడు మాత్రం నిందించడం మానలేదు. వారితో ఒకే గదిలోవున్న శ్రీ సాంబమూర్తిగారికి విసుగెత్తి "సత్యాగ్రహమట! ఏమిటీ వాగుడు? . అలా వెళ్ళటానికి ధైర్యం, సాహసం, త్యాగమూ కావాలి; నిన్నూ, నన్నూ ఆ కన్నంలో పెట్టి నెట్టినా వెళ్తామటోయ్?" అని కసిరారు. అంతటితో ఆ కాంగ్రెసు నాయకుని కోపం చల్లారింది.

వెళ్ళిపోయిన వారిద్దరు నా గదిలో ఉండేవారు. అందువల్ల మా బంధువుల యిండ్లవద్ద పోలీసులు కాపలా కాచారట. పరారైనవారు నా చేతి గడియారం, మరికొందరి గడియారాలు మాకు తెలియకుండానే తీసుకెళ్ళారు. ఎక్కడయినా అమ్ముకొని ప్రయాణం సాగించాలని, అనుకున్నారట. కాని మా గడియారాలను తిరిగి పంపివేశారు.

## గౌరవనీయులైన సాంబమూర్తి

ఈ విధంగా ప్రభుత్వం ఓడిపోతున్నా తన దుష్టత్వాన్ని మానలేదు. డెటిన్యూలము 174 మంది మయ్యాం. ఎక్కువ అపాయకరమైనవారు, తక్కువ ప్రమాదకారులు అని రెండు తరగతులుగా సూపర్నెంటుగారు విభజించారు. 25 మందిని స్త్రీల పాతయార్డులోను, మిగతా వారిని వెలుపల క్వారంటీనులో ఉంచారు. శ్రీ కాళేశ్వరరావుగారు తనకిష్టమైన యిరవై అయిదు పేర్ల పట్టీ తయారుచేసి సూపర్నెంటుకు యిచ్చారని వదంతి. దానితో ఒక నిరసన సభపెట్టి ఆయన్ని ఖండించారు. కాంగ్రెసు నాయకులు కూడా నిరసించారు. ● శ్రీ సాంబమూర్తిగారి గాంభీర్యము, త్యాగమువల్ల కాంగ్రెసు సంస్థకు, కాంగ్రెసు నాయకులకు గౌరవమెంత అధికమగుచుండెనో శ్రీ కాళేశ్వర రావుగారివల్ల అంత అధోగతి పాలవుతున్నదని అనుకునేవారు.

(ఇంకా ఉంది)

● మద్రాసు గవర్నరుగారు మరునాడు జైలును చూచేందుకు వస్తారనగా ముందు రోజున డిస్ట్రిక్టుమాజిస్ట్రేటు శ్రీ సాంబమూర్తిగారిని కలుసుకొని "గవర్నరుగారికి మీతో మాట్లాడాలని వుంది. రేపు ఆఫీసులో ఫలానా టైముకు కలుసుకుంటారా?" అని అడిగారు. "ఎప్పుడూ 24 గంటలూ నా గదిలోనే వుంటాను. గవర్నరుగారు ఎప్పుడు కలుసుకోవాలంటే అప్పుడు నా గదిలో కలుసుకోవచ్చు" అన్నారు సాంబ మూర్తిగారు. "కాదు, ఆఫీసులో కలుసుకోండి" "నాకు వారితో పనేమీ లేదే! వారికి నాతో పనివుంటే నా గదిలో కలుసుకోవచ్చు"నని చెప్పారు. అందరం సంతోషించాము. మరునాడు గవర్నరు మే మున్నచోటికి వచ్చినప్పుడు ఎవరిగదిలో వారు వుండాలని తీర్మానించుకున్నాము.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1995 మే 21 నుండీ 1995 జూన్ 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | 21 | 28 | 4 | 11 | 18 |
| సోమవారము | 22 | 29 | 5 | 12 | 19 |
| మంగళవారము | 23 | 30 | 6 | 13 | 20 |
| బుధవారము | 24 | 31 | 7 | 14 | |
| గురువారము | 25 | జూన్ 1 | 8 | 15 | |
| శుక్రవారము | 26 | 2 | 9 | 16 | |
| శనివారము | 27 | 3 | 10 | 17 | |

మే 24 :- రోహిణీ కార్తె రాక - రా. 7-42.

మే 31 :- ఆదాయపుపన్ను చట్టములోని 192వ విభాగము క్రింద జీతములో పట్టుకొన్న వివరాలను తెలుపు "అన్యువల్ రిటర్ను" అనగా 24వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

మే 31 :- ఆదాయపుపన్ను చట్టములోని 194 B విభాగము క్రింద లాటరీలు, 'క్రాస్ వర్డ్ పజిల్స్' ద్వారా వచ్చు ఆదాయములపై పట్టుకొన్న మొత్తం వివరాలను తెలుపు "అన్యువల్ రిటర్ను" అనగా 26 B ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను శాఖాధికారికి చేర్చుటకు తుది రోజు.

మే 31 :- ఆదాయపుపన్ను చట్టములోని 194 BB విభాగము ప్రకారము గుర్రపు పందెముల ద్వారా వచ్చు ఆదాయముల విషయంగా పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు "అన్యువల్ రిటర్ను" అనగా 26 C ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

జూన్ 8 :- మృగశిర కార్తె రాక - రా. 7-15.

జూన్ 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

జూన్ 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**21, 28, 4, 11, 18 ఆదివారాలు**

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్ని చోట్లా " VASAVI "

టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114,

పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :- 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వతసభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీమాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.116/-లు చెల్లించిన వారికి సంవత్సరంనకు ఒకసారి ప్రసాదం పంపించబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు

యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల :</u> తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్థుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

**హాల్సు డోనార్సు :** 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును 20 అంకణములు పరిమితం.

**మహారాజ పోషకులు :** 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో మరియు పేరు శిలాఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

**రాజ పోషకులు :** 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. తిరుమల మేదరిమెట్ట ప్రాంతంలో మనము కట్టుచున్న సత్రం దగ్గర కట్టిన షెడ్డులో తాత్కాలిక కార్యాలయం ప్రారంభించినాము.

4. <u>వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.</u>

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణము చేసి, క్రింద భాగములో వైశ్యులు కళ్యాణంలు చేసుకొనుటకు గాని, యితర సమావేశములు, శుభకార్యములు చేసుకొనుటకు గాని తయారుచేస్తూ, మొదటి అంతస్థులో భోజనహాలు నిర్మాణం చేసి, నిత్య భోజనములు, రెండవ అంతస్థు నుండి వీలైనన్ని అంతస్థులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు తీర్మానించినాము. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళంలు సమర్పించకోర్తాము.

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజాలు రూము రిజర్వేషన్ చేయబడును. రూము సైజు 200 చ.అ. పోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజాలు రూము రిజర్వు చేయబడును. పోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజాలు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫొటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కావున సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళములు నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వ్రాయబడును. వీరికి

వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో-దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

M.Tech., ప్యాసు అయిన వారికి యీ సంవత్సరము రు.3500/-ల ప్రకారం ముగ్గురికి యివ్వబడును.

6. వాసవీ అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు 1995లో స్వామి అనుగ్రహం మేరకు పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.

—: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :—

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,
మార్కాపురం – 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.

N.B :- పై సత్రముల పేరుతో – D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# ఇదేనా? వాస్తుశాస్త్రం

'సాముద్రిక వాస్తు విద్యా ప్రవీణ' శ్రీమతి బి.లక్ష్మీకాంతమ్మ, ప్రొద్దుటూరు

క్రొత్తగా నిర్మితమైన ఏయే యింటిని చూచినా, ఈశాన్యం భోసిపోయి వుంటుంది. వర్షం వస్తే, గృహోపరిభాగంలో కురిసిన జలం, గృహావరణంలో కురిసిన జలం అంతా కాలువ కట్టి ఈశాన్యంలో పొర్లుతూ దాటిపోతుంది. ఆ జలం సర్పం వలె మెలకలు తిరుగుతూ వెళ్లిపోతే సంపద తొలగిపోతుందని నమ్మేవారు కూడ కొందరున్నారు. అందుచేత సాధ్యమైనంత వరకు పల్లంచేసి, నిలుపుకొనే వారున్నారు. కొందరు శాశ్వతంగా ఆదిశ ఆర్ద్రంగా వుండాలని నుయ్యి త్రవ్వించుకొనే వారున్నారు.

ముఖద్వారం ఈశాన్యం. ప్రతి గదికి ఈశాన్యదిశలో ద్వారం. అందరికీ ఇదే పరిపాటి అయిపోయింది. వాస్తు సిద్ధాంతులను సంప్రతించి కొందరు, బజారులో దొరికే వాస్తు పుస్తకాలను కొని చదివి కొందరు, తాపీ మేస్త్రీల సలహాతో కొందరు - అందరూ ఇదే పనిచేస్తున్నారు.

కాంట్రాక్టర్లు, ధనికులు ఇండ్లు కట్టించి, అద్దెకు ఇస్తూవుంటారు. వారు కూడ ఇదేపని చేస్తున్నారు. ఎందుకంటే, నివాసముండే వారు అది బాడుగిల్లు అయినా వాస్తు ప్రకారం ఉండాలని భావిస్తున్నారు. ఇంతెందుకు, తమ పిల్లలను స్కూల్లో చేర్పించాలంటే, ఆ స్కూలు వాస్తు చూస్తున్నారు.

ఆదిలో ఆ వాస్తును అనుభవ వాస్తు అన్నారు. ఒక ఊళ్లో ఒక ఆసామి ఇంటికి ఈశాన్యం ఖాళీగావుంది. బావి వుంది. అతడు కోటీశ్వరుడు. కనుక ఈశాన్యం ఖాళీచేసి బావి త్రవ్విస్తే, కోటీశ్వరుడు కావచ్చు. ఇది అనుభవమని వీరి ప్రభోధం. తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయమునకు ఉత్తరాన నూతులు, ఈశాన్యమున కొలను కలవని ఈ క్రొత్త వాస్తుశాస్త్రము ప్రతిపాదించిన వీరి మూలపురుషుడు ప్రకటించెను. ఈశాన్యపు జలమే ఐశ్వర్యదాయకమైతే, అదేమి పెద్దపని కాదు, అందరూ ఆపని చేయవచ్చు. చేసి చూడండి. ఫలితం చెప్పండి.

ఈశాన్యదిశ గురుస్థానం. అంటే ఆదిశకు అధిపతి బృహస్పతి. ఈయన పుత్రకారకుడు. ఈశాన్యదిశయొక్క గుణదోషాలు పుత్రసంతతి మీద ప్రభావం చూపిస్తాయి. ముఖ్యంగా జ్యేష్ఠ పుత్రునికి అన్వయిస్తాయి. ఈశాన్యం వ్యర్థంగా ఎడారి వలె వుంటే, చెప్పనక్కర లేదు. పుత్రులు వ్యర్థులు. తండ్రి పట్ల విముఖత చూపుతారు. దుర్వ్యయం చేస్తారు. 'బంగారం మాయమవుతుంది. మనస్సు చీకాకుగా వుంటుంది. ఈశాన్యపు గదిలో శయనిస్తే, సరిగా నిద్ర పట్టదు. దుఃస్వప్నాలు వస్తాయి. శుభకార్యాలకు ఆటంకం కలుగుతూ వుంటుంది. బ్రాహ్మణ్యం పొడ గిట్టదు. మైత్రికాని, వర్తకంలో పొత్తుకాని పనికి రాదు.

బ్రాహ్మణుడు వృద్ధుడైతే, ఆపద తప్పదు. మరీ నైష్ఠికుడైతే, పొగలేని మంటలు రేపి, బూడిద చేస్తాడు. ఈశాన్యం పెంచుకొన్న వారికి, గురువారం కూడ కలిసి రాదు.

గురుడు శుభుడై, గురుమహాదశలో ఉండేవారికి పై విషయాలు వర్తించవు. సరికదా, వారికి పుత్రులు, దశరథునికి శ్రీరామచంద్రునివంటి వారుంటారు. బ్రాహ్మణ్యం ఆశీర్వదిస్తే అక్షరాక్షరం ఫలవంతమవుతుంది. చెయి తాకితే మట్టి బంగారమవుతుంది. అయితే, గురుడు శుభుడై, చతుర్థభావంలో పాపగ్రహదృష్టి లేకుండ స్వచ్ఛంగా ఉండే యోగం ఎందరికి వుంటుంది? నూటికి ఒక్కరికి గూడ వుండదు. వెయ్యి మందిలో ఒకరికి కొద్దియో గొప్పయో వుండవచ్చు. వీరికి ఈశాన్యం పెరుగుదలవల్ల పైయోగం పడుతుందని చెప్పలేదు. ఈశాన్యం పెరగగూడదు. ఈ యోగం వున్నవారికి పెరిగినా పరవాలేదు. ఇతరులకు వలె హాని జరుగదు. అంతే.

ఏ గ్రామంలో అయినా, పట్టణంలో అయినా, నగరంలో అయినా, చూడండి. ఈశాన్యంలో వీధి చివర వుండే యిల్లు దెబ్బతిని వుంటుంది. ఆ యింటికి ఉత్తర ఈశాన్యం కాని, తూర్పు ఈశాన్యం కాని పెరిగి ఖాళీగా వుంటే ఇంకా దెబ్బతింటుంది.

ఈశాన్య గృహానికి ఈశాన్యదిశలో విస్తారంగా ఖాళీస్థలంవుండి, ఎదురుగా ఇండ్లుకానీ, గుడిసెలు కానీ, చెట్లుచేమలు కానీ లేకుండా, సర్వశూన్యంగా వుంటే, ఆ యింటి యజమానికి వైకుంఠానికి పాస్‌పోర్టు రెడీగా వుంటుంది. ధనుర్మీనమాసాలలో వీసా లభిస్తుంది. ఆ యింటిదీపం రాత్రివేళల శూన్యంలోకి చూస్తూ వుంటే వైకుంఠయాత్ర తప్పదు.

ఊరికి ఈశాన్యం ఉత్తమమని, ప్రతివీధిలోను ఈశాన్యభాగం ఉత్తమమని, ప్రబోధించే ఆధునిక వాస్తు ప్రచారకులు, పరిశోధకులు వాస్తవం గుర్తించుట లేదు. ఈశాన్యకోణంలోని గృహాలు, తూర్పున, ఉత్తరాన రోడ్లు కలిగిన గృహాలు పరిశోధిస్తే తెలుస్తుంది వాస్తవం.

ఈశాన్యంలో నీళ్లు వుంటే వంశవృద్ధి అనీ, నైరృతిలో నీళ్లుంటే యజమాని చస్తాడనీ అన్నారు. కాని, ఈ పెద్ద మనుష్యులే నైరృతిలో ఓవర్‌హెడ్ ట్యాంక్ నిర్మించి, నీళ్ళు స్థిరంగా స్టాకు వుంచుతున్నారు. వీరి వైత్రి చూడండి. ఈశాన్యంలో నీళ్లతొట్టి క్రింద వుంటే బరువు కాదట. అదే నీళ్లతొట్టి పది అడుగుల ఎత్తున ఏర్పాటు చేస్తే, అది బరువట! ఎవరికి బరువు? నీళ్లతొట్టి క్రింద వుంచినా మీద వుంచినా, మోసేది అక్కడి భూమాతయే కదా.

'రాజగృహంబు కంటె, అభిరామముగా ఇల్లు కట్టరాదు' అని మహాభారతం చెబుతుంది. అది రాజుల కాలం. రాజోద్యోగులు కాని, ధనికులు కాని, రాజుగారి యింటి కంటె ఉన్నతంగా అందంగా ఇల్లు నిర్మించుకోగూడదన్నారు. ఇపుడు రాజులు లేరు. మంత్రులున్నారు. మంత్రిగారు ఈశాన్యం బ్రహ్మాండంగా పెంచి, పల్లంచేసి, ఇల్లు కట్టించారను కొందాము. తరువాత ప్రక్కయింటివాడు

నక్షత్రమండలానికి దరిదాపుగా వుందా? అన్నట్లు మేడ నిర్మిస్తాడు. తత్ఫలితంగా మంత్రిగారి యీశాన్యదిశ మునిగిపోతుంది. మంత్రిగారి పని గోవిందా అవుతుందా? అధునిక వాస్తు పరిశోధకులు అవుతుందనే అంటారు. మనవీధిలో మన పొరుగింటి వాడు,మనయింటి కంటె ఉన్నతంగా ఇల్లు కట్టకుండ, ఒత్తి పట్టుకోవాలి. ఇదేనా? వాస్తుశాస్త్రం?

అదొక మహాపర్వతం. దక్షిణం, పశ్చిమం ఆక్రమించి వుంది. తూర్పు, ఉత్తరం అంతా పల్లం, మైదానం. ఒక నది ఈశాన్యదిశాభి ముఖంగా ప్రవహిస్తూవుంది. దక్షిణ పశ్చిమదిక్కుల నిక్కివున్న కొండను పారు చేసుకొని, నదికి దక్షిణభాగంలో ఉన్నత ప్రదేశంలో ఇల్లు కట్టుకొంటే, అది అధునికవాస్తు పరిశోధకుల సూత్రాలకు అనుగుణంగా వుంటుంది. నూటికి నూరు పాళ్లు సరిపోతుంది. మరి దాని యోగం ఎలా విజృంభిస్తుందో చూస్తే తెలుస్తుంది.

ఒకడు ఇల్లు కట్టి చెడి, అమ్ముకొంటాడు. కొన్నవాడు చెడిపోడు. ఒకయిల్లు నాలుగైదు చేతులు మారుతుంది. కొన్నవారందరూ డింకీ కొడుతూవుంటారు. కొంతకాలానికి ఆయిల్లు నిర్మానుష్యంగా నిలుస్తుంది. అటువంటి కేసుల్లో భూశోధన చేయాలి. భూగతమై శల్యకంకాళాలు వుండవచ్చు. హతులై పూడ్చి పెట్టబడిన స్త్రీయో, పురుషుడో వుండవచ్చు. ఇటువంటి సందర్భాలలో వాస్తు పండితులకు భూగర్భ వస్తు పరిజ్ఞానం వుండాలి. కల్మషం తొలగించి, పసుపునీళ్లు చల్లితే దోషం పోతుంది. ఇందులో మరొక విశేషముంది. అచ్చంగా బుధజాతకుడు వస్తే, భూతప్రేతవ్రాతం అతనికి అపకారం చెయ్యవు. అసలు అగుపించవు. నిత్యకల్యాణం పచ్చతోరణంగా కలకల లాడుతుంది. ఒకడు చెడిన చోట మరొకడు బాగుపడతాడు అంటే ఇదే రహస్యం. అందరికీ ఒకే నమూనా వాస్తు పనికి రాదు. గోడ్డెదాటు పద్ధతి ప్రమాదకరం.

## కడప జిల్లా ఆర్య వైశ్య సంఘ ప్రధాన కార్యదర్శిగా శ్రీ వి.వి. సుబ్రమణ్యం

ప్రొద్దుటూరు పుర ప్రముఖులూ, ఉత్సాహవంతులు శ్రీ వల్లంకొండు వెంకట సుబ్రమణ్యం గారలు కడప జిల్లా ఆర్య వైశ్య సంఘం ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలను స్వీకరించారు. కార్యదీక్ష, కార్యదక్షత గల శ్రీ సుబ్రమణ్యంగారు మంచి మనస్సున్న వారు. ధార్మిక కార్యక్రమాల యెడ ఆసక్తి కలవారు. ప్రొద్దుటూరు పట్టణము కోనేటి కాల్వ వీధిలోని శ్రీరామస్వామి దేవాలయం మెయిన్ బజారులో గల శ్రీ ఆత్మారామ స్వామి దేవాలయాల పునరుద్ధరణకూ, వాటిని శోభాయమానంగా చేయుటకూ కృషి చేసిన వారు శ్రీ సుబ్రమణ్యం గారే. వీరి అకుంఠిత కృషివల్ల ఆత్మారామస్వామి దేవాలయములో ఒక భాగంగా నిర్మితమైన నూతన కల్యాణమంటపము బహుచక్కగా ఉంది. ప్రొద్దుటూరు పట్టణములో వివాహ వసతుల కొఱతను తీర్చుటకు కూడ తోడ్పడుచూ ఉంది.

# రామచరిత మానసం

(తులసీ రామాయణము)

తెలుగుసేత : శ్రీ గాథంశెట్టి శ్రీరాములు, యం.ఎ.,

(మార్చి సంచిక తరువాయి)

అని పలికి పరమేశ్వరుడు అంతర్ధాన మయ్యాడు. భగవంతుని పలుకులు విని గురువుగారు సంతోషించి నన్ను దీవించి వెళ్లిపోయాడు.

గరుత్మంతా, కాలగతిని బట్టి నేను వింధ్య పర్వతాల్లో చాలాకాలం సర్పమై పడివుండి, తరువాత కొన్నాళ్లకు సర్ప శరీరాన్ని వొదిలాను. కాని ఎన్ని శరీరాలు ధరించినా ఏమీ బాధపడలేదు. పాత వస్త్రాన్ని వొదిలి పెట్టి కొత్త వస్త్రాన్ని ధరించినట్లు అనేక జన్మలు ఎత్తాను. ఏ జన్మలో కూడా నేను దుఃఖాన్ని పొంద లేదు. ఈశ్వరుని దయవల్ల ఏ జన్మ లోనూ పూర్వ జన్మజ్ఞానము కోల్పో లేదు. ఇప్పటికీ గూడా గురువుగారిని అవమానించిన దుస్సంఘటనా, ఆదయా మయుడు నాపైన చూపించిన కరుణా జ్ఞప్తికి వచ్చినపుడల్లా ఎంతో కుమిలి పోతూ వుంటాను.

కడపారిగా నేను బ్రాహ్మణ జాతిలో జన్మించాను. వయసు వచ్చిన తరువాత మా తండ్రిగారు నన్ను విద్యాలయానికి పంపి చదివింప చేశారు. కాని, నాకు విద్య యందు ఇష్టం కలుగలేదు. శ్రీరాముని పాదాలందు బాగా భక్తి కుదిరింది. చదువు అబ్బలేదు. కొంత కాలానికి నా తల్లి దండ్రులు గతించారు. అటుతరువాత నేను శ్రీరామ స్మరణ చేస్తూ అరణ్యా లందు తిరుగుతూ మునులను దర్శిస్తూ తెలియనివి అడిగి తెలుసు కుంటూ వచ్చాను. అందువల్లనాలోని దుర్గుణాలు చాలా వరకు నశించాయి. భగవంతుణ్ణి ప్రత్యక్షంగా చూడాలనే కోరిక అంత కంతకూ ఎక్కువయింది. కొందరు మహాత్ములు భగవంతుడు నిరాకారుడు, సర్వాంతర్యామి అని చెబుతూ వచ్చారు. కాని వాళ్ల మాటలు నాకు నచ్చలేదు. తిరుగుతూ తిరుగుతూ మేరు పర్వతం వద్దకు వెళ్లాను. అక్కడ ఒక వటవృక్షం క్రింద కూర్చొని తపస్సు చేస్తూ వున్న "లోమశు"డనే మహాముునిని చూశాను. ఆయనకు సాష్టాంగ నమస్కారం చేశాను. ఆయన నా వినయాన్ని చూసి నీవు ఎవరు? ఇక్కడకు ఎందుకొచ్చావు? అని అడిగాడు. నేను శ్రీరామచంద్రుణ్ణి స్వయంగా చూడాలను కుంటున్నాననీ, నాకు సగుణ మార్గం ఉపదేశించి శ్రీరామ దర్శనం చేయించమనీ ప్రార్థించాను.

ఆయన నిర్గుణ మార్గాన్ని బోధించి సగుణ మార్గాన్ని ఖండించాడు. నేను

నిర్గుణ మార్గాన్ని ఖండించి సగుణ మార్గాన్ని సమర్థించాను. అందుకు ఆ మునికి నా పైన బాగా కోపం వచ్చింది. ఎంతటి శాంతమూర్తికైనా అవమానం కలిగిన యెడల కోపం రాకపోదు. చంద నపు చెక్క అయినా బాగా రాపిడి చేస్తే అగ్ని పుట్టుకొస్తుంది. అలాగే మునికి బాగా కోపం వచ్చింది.

మాయావశుడైన జీవుడు ఈశ్వరు నితో సమానుడు కాగలడా! అందరి మేలు కోరేవాళ్లకు శత్రువులు వుంటారా! పరుస వేది దగ్గరున్నవాడు దారిద్ర్యము అనుభవించునా! ఇతరులకు ద్రోహము చేయువాడు నిర్భయంగా తిరగ గలడా! బ్రాహ్మణులకు ద్రోహము తలపెట్టువాడి వంశము నాశనము కాకుండా వుంటుందా? ఆత్మానందము పొందేవాళ్లకు కర్మల యందు ఆసక్తి వుండునా? దుష్టులతో సహవాసము చేసేవాళ్లకు మంచి బుద్ధులు అలవడునా? పరస్త్రీలను కోరేవాళ్లకు ఉత్తమగతులు కలుగుతాయా? పర మాత్మను దర్శించినవాళ్లు జనన మరణ బంధనాల్లో తగుల్కోవడం వుంటుందా? నీతిలేనిరాజు న్యాయంగా రాజ్యం చేయ గలడా? తదేక దృష్టితో రాముని భజన చేయువాడు పాపము చేయగలడా? ధర్మము చేయనివాడు దాతృత్వాన్ని పొందగలడా? మానవ శరీరాన్ని పొంది నందుకు రాముని భజించక కాలయా పన చేయడం హేయము. ఈ విధంగా నేను అనేక ఉదాహరణలు చెప్పి సగుణ సిద్ధాంతాన్ని నిరూపించాను.

అందులకు ఆ మునీంద్రులకు నా పైన చాలా కోపంవచ్చి, "ఓరి మూర్ఖుడా! నేను సర్వోత్తమమైన జ్ఞాన బోధ చేశాను. నువ్వు దాన్ని తిరస్కరించి కాకి మాదిరి ఏ వేవో వాగావు. కనుక నీవు కాకి రూపం ధరించెదవుగాక," అని నన్ను శపించాడు. అప్పుడు నేను ఆ బ్రాహ్మణుని శాపంతో వెంటనే కాకి రూపం ధరించాను.

శ్రీ రామచంద్రుని పాదాలందు ప్రేమగల వాళ్లు క్రోధాభిమానాలుత్యజించి ప్రపంచము యావత్తును రామ మయంగా చూసేవాళ్లు ఇతరులతో వైరం ఎలా పెట్టు కుంటారు. ఇదంతా ఆ ఋషి తప్పు గాదు. శ్రీ రామచంద్రుడు అందరి హృదయాల్లో నివసిస్తూ వుంటాడు. ఆ ప్రభువు మునీశ్వరుని బుద్ధినిమార్చి వేశాడు. తరువాత ఆ ముని నాకు దయతో శ్రీ రామ మంత్రము ఉపదేశించి బాలరూపు డైన శ్రీ రామచంద్రుని ధ్యానించు చుండమని ఆదేశించాడు. నేను నిత్యమూ ఆ మంత్రాన్ని ధ్యానించుటవల్ల నాకు చక్కగా మనశ్శాంతి కలిగింది. ఆ ముని నన్ను తనవద్ద కొన్నాళ్లు వుంచుకొని నాకు శ్రీ రామచంద్రుని చరిత్ర చెప్పి ఇలా అన్నాడు.

"నాయనా, నువ్వు శ్రీ రామచంద్రుడి ప్రియ భక్తుడవని తెలిసి ఈ చరిత్ర నంతా నీకు చెప్పాను. శ్రీ రాముడికి విముఖులైన వారికి నువ్వు ఇది చెప్పవద్దు. జ్ఞాన వైరాగ్యాలతో నీ హృదయం

నిండిపోయి వుంది. నీవు భగవంతుణ్ణి భజిస్తూ ఎక్కడ నివసిస్తావో అక్కడికి యోజనం వరకు మాయా మోహాలు వ్యాపించవు. కాలవైపరీత్యం వలన వచ్చే వ్యాధులు నీకు ప్రాప్తించవు. భగవానుని పాదాలందు నీకు గల భక్తి దిన దినాభివృద్ధి అవుతూ వుంటుంది. లోకంలో నీకు అసాధ్యమైన పని ఏదీలేదు."

అని లోమశ మహర్షి నాకు ఉపదేశించాడు. నేను మునిపాదాలకు నమస్కరించి ఆయన ఆశీర్వాదం పొంది సెలవు తీసుకొని ఈ స్థలానికి చేరాను. ఇక్కడకు నేను వచ్చి పదిహేడు కల్పాలు అయింది. ఇక్కడ నేను ఎప్పుడూ శ్రీ రామ చరిత్రను గానం చేస్తూ వుంటాను. భక్తి తత్పరతతో పక్షులన్నీ వచ్చివింటూ వుంటాయి. అప్పుడప్పుడూ భగవానుడు మానవరూపం ధరించి అయోధ్యకు వచ్చినప్పుడల్లా నేను వారి వద్దకు వెళ్లివారిని దర్శించి వారి వాక్యాలను విని ఆనందించి వస్తూ వుంటాను. నేను కాకి రూపం ధరించడానికి కారణం ఇది. రామ భక్తి ఇలాంటిది. అందువలన నాకు ఈ కాకి శరీరం మిక్కిలి ప్రీతి దాయకమయినది. రామభక్తిలో ఇలాంటి మహత్తు వుంది. పామరులు దాన్ని తెలుసుకోలేరు. పాల కొరకు ఇంటిలో వున్న కామధేనువును వొదిలిపెట్టి అడవిలో వున్న జిల్లేడు చెట్ల కొరకు అన్వేషిస్తారు. వీళ్ల మూర్ఖత్వం ఏమని చెప్పాలి.!

కాక భుశుండి వాక్యాలు విని గరుత్మంతుడు సంతోషించి "స్వామీ, ఇప్పుడు నా సందేహాలన్నీ తీరిపోయాయి. రామచరిత్రనంతా విన్నాను - కాని మిమ్మల్ని ఇంకొక విషయం అడగ దల్చాను. దాన్ని దయచేసి వివరించండి. జ్ఞానంతో సమానమైనది వేరొకటి లేదని వేదాలూ, పురాణాలూ చెబుతూ వున్నాయి మీరు భక్తి సులభమైనదని చెబుతున్నారు. జ్ఞానానికీ భక్తికీ భేదం ఏమిటో తెలియ చేయండి." అని అడుగగా కాక భుశుండి గరుత్మంతునితో ఇలా చెప్పాడు.

"భక్తికీ, జ్ఞానానికీ భేదం ఏమీలేదు. రెండు మార్గాలూ సంసార సాగరాన్నుండి తరించడానికి చెప్పబడ్డవే! జ్ఞాన వైరాగ్యాలు మహాపురుషుల లక్షణాలు. అవి చాలా ప్రబలమైనవి. మాయ నర్తకి వంటిది. స్థిత ప్రజ్ఞులయిన వాళ్లు, ధీరులయిన వాళ్లు మాయను జయిస్తారు. కాముకులు, విషయ వాంఛలు కలిగినవాళ్లు, భోగులు మాయకు లొంగిపోతారు. మాయ భగవంతుని వలన సృష్టించ బడింది. కనుక ఆయన దయ వుంటేనేగాని మానవులు మాయను జయించలేరు. తపోధనులు మాత్రము మాయను ఎదిరించి జయము పొందుతారు.

భగవంతుని మాయ స్త్రీ రూపంలో వుంది. అందువలన భగవంతునికి విముఖులైన వారు మాయను జయించ లేరు. భక్తిని చూసి మాయ భయపడు

తుంటుంది. భక్తి కొరకు మహాపురుషులు సైతము పరితపిస్తూ వుంటారు. జీవులందరూ దైవాంశ సంభూతులు. మాయా బంధాలు ఎంతో బలమైనవి. జీవులు కోతుల్లాగా తమంతటతామే బంధించు కుంటారు. ఆ బంధనాలు మిథ్య అయి వుండీ కూడా బాగా ప్రతిఘటిస్తేగాని విడివడవు.

ఇందులకై జప తపోయజ్ఞ హోమాలనే మందులు వాడమని పెద్దలు చెప్పారు. మాయా జీవులు అజ్ఞానమనే అంధకారంలోనే చిక్కుపడి వున్నారు. కనుక శ్రీ రాముని భజిస్తేగాని ఆ మాయలు తొలగవు. నీచులకు గొప్పతనము లభించగానే తమను రక్షించినవాళ్లను మరచిపోతారు. ఎలాగంటే, అగ్ని వలన పొగ ఏర్పడుతుంది. కాని ఆ పొగయే మేఘాధి పత్యము చేరుకోగానే వర్షమై తనను సృష్టించిన అగ్నిని చల్లారుస్తుంది. దారిన పడి వున్న దుమ్ము పైన అడుగు వేస్తే ఎగిరి నెత్తిన పడుతుంది. బుద్ధిమంతులైన వారు అల్పులతో స్నేహం చేయరు. నేను దుష్టుడను కనుక బ్రాహ్మణుణ్ణి ఎదిరించాను.

శ్రీ రాముని భక్తి సుందరమైన చింతామణివంటిది. అది అందరి హృదయాల్లో వుంటుంది. అది స్వయం ప్రకాశం కలది. మోహాన్ని దగ్గరకు రానీయదు. దాన్ని ఏ శక్తీ ఎదిరించలేదు. దాని ప్రకాశంతో ఎంతటి గాఢాంధకారమైనా తొలగిపోతుంది. మదమాత్సర్యాలనే మిడుతలు దానిలోపడి భస్మమవుతాయి. లోభము దాని వద్దకు చేరలేదు. దాని ప్రభావంతో విషము అమృతంగా మారిపోతుంది. శత్రువులు మిత్రులవుతారు. భక్తి అనే మణి ఎవరి వద్ద వుంటుందో వాళ్లకు ఆధి వ్యాధులు అంటవు. మహాత్ములు ఆ మణి కొరకు ప్రయత్నిస్తూ వుంటారు. మహాత్ములు తప్ప దాన్ని మరెవ్వరూ తెలుసుకోలేరు. శ్రీ రాముని దయవల్లనే దాన్నివాళ్ల పొందగలుగుతారు. దాన్ని పొందడానికి చాలా ఉపాయాలున్నాయి. ధానికి జ్ఞాన వైరాగ్యాలు రెండూ రెండు నేత్రాలు. భక్తి చేత ఆ మణిని పొందవచ్చు.

శ్రీ రామచంద్రుడు సముద్రం వంటి వాడు. ఆయన భక్తులు మేఘాల్లాంటి వాళ్లు. భగవానుడు చందన వృక్షము వంటి వాడు. గాలి వస్తే సువాసన వ్యాపిస్తుంది. మహాత్ములు దాన్ని పొందుతారు. సత్పురుషులతో సహవాసం చేయడం మేలు. సాధువులనే దేవతలు వేదములనే సముద్రాన్ని జ్ఞానమనే మందర పర్వతంతో మధించి భక్తి అనే అమృతాన్ని పొందగలుగుతారు. వైరాగ్యమనే డాలుతో తమను తాము రక్షించుకుంటూ జ్ఞానమనే ఖడ్గముతో కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యాలనే శత్రువులను ఖండించి భక్తి అనే విజయాన్ని పొందుతూ వుంటారు." (ఇంకా ఉంది)

# కళత్ర భావ ప్రాధాన్యత

రచన : శ్రీ సత్రుసాల వేణుగోపాల్, బి.ఎ., ధర్మవరము

మానవ సృష్టి మనుగడకు మూలాధారము దాంపత్య సుఖ జీవనము. దాంపత్యము సుఖ సంతోషాలతో వర్ధిల్లాలంటే దంపతుల, అన్యోన్య అనురాగాలు అమృత తుల్యంగా ఉండాలి. శకటమునకు ద్విచక్రములు, ఎద్దులు ఎట్లు సహకరించి ప్రయాణమునకు ఆధార భూతములగుచున్నవో అట్లు ఈ సంసార రథచక్రమునకు దంపతులు కారణ భూతులగుచున్నారు.

"కావ వలయు మగడు కాంత నెల్లప్పుడు కావ లేనివాడు ఛావవలయు" అను వేమన సూక్తి మనకు తెలుసు. జ్యోతిష్యాస్త్ర పరంగా వివాహ విషయ సందర్భములందు "నాడీ" కూటమును దంపతుల విషయమై ఆలోచన చేయుదురు. దంపతులకు భిన్న నాడి యున్నదాంపత్యము బాగా ఉండునని చెప్పుదురు. నాడి యనగా మనిషికి "గుండె" ఎట్లు ముఖ్యమో అట్లు దాంపత్యమునకు నాడి అట్లు దానినే స్పందన అని కూడా అందురు.

శంకరుని గౌరీ శంకరుడనియూ, అర్ధనారీశ్వరుడనియూ పిలుతురు.కారణము వారి అన్యోన్యత. లక్ష్మీ నారాయణులు, సీతారాములు వీరి దాంపత్యము జగత్ప్రసిద్ధము.

కళత్ర స్థాన విషయమై సాధారణంగా జనులు కనుగొనాలని ఉత్సుకత చూపిస్తూ ఉంటారు. అది మానవ నైజము. కళత్ర భావము లగ్నమునుండి ఏడవది. కళత్ర భావ విషయ సేకరణకు ముందు సప్తమాధిపతితోను, కళత్ర కారుడగు శుక్రునితోను సంబంధము లేని కుజుని చూచుట చాలా ముఖ్యము. కళ్యాణవిషయ సందర్భములందు "కుజదోషము"ను గమనించి కళ్యాణమును చేయండి అనే విషయము మనము గమనించుట కద్దు. దాని విషయమై ఆలోచన చేయునపుడు కుజుడు 1,2,4,7,8,12 స్థానముల యందున్నపుడు దానిని కుజదోషమనియూ అది స్త్రీ, పురుషులయందు ఇరువురకు వర్తించు ననియూ తెలుపుదురు. స్త్రీకి ఉన్న పురుషుడును, పురుషునకున్న స్త్రీయును గతింతురని కుజ దోషము తెలుపును. ముఖ్యంగా స్త్రీపురుషులకు ఇరువురకు కుజదోషమున్న దోషము పరిహారమై శుభత్వము కూర్చును. 1,2,4,7,8,12 స్థానములు కుజునకు స్వక్షేత్ర, ఉచ్ఛక్షేత్ర, మిత్రక్షేత్రములై అందు కుజుడు ఉన్న దోష పరిహారమగును. వ్యయ స్థానము దక్క కుజుడు భాగ్యలాభాధిపతియై పై స్థానములందున్ననూ దోష పరిహార మగును.

ముఖ్యముగా స్త్రీ జాతకమునందు మాంగల్య స్థానమునకు అష్టమమున కుజుడు ఉన్న వైధవ్య యోగము కలుగదు. పై పెచ్చు శుభములు చేయును. ఇవి గాక ద్వితీయమందు శుభ గ్రహములగు బుధ, గురు, శుక్ర, పూర్ణ చంద్రులు ఇతర పాప గ్రహములతో కలియక ఉన్న కుజ దోషభంగము అగునని శాస్త్ర నిర్దేశికము.

కళత్ర భావమును విచారించు సమయమున పై కుజ దోషమునే కాక కళత్ర స్థానమగు సప్తమ రాశిని, కళత్ర

కారకుడగు శుక్రుని, లగ్నాధిపతిని చక్కగా గమనించ వలయును. సప్తమ భావము నుండి లగ్నము 180° లలో వుండుటచే లగ్న సప్తమ భావములను గమనించ వలయునని శాస్త్రము. కళత్రము జీవితమున సమభాగిని అగుటచే సప్తమ స్థానమే కళత్రమునకు ఆధారభూత మయినది. కళత్ర భావమునుండి వివాహ విషయమేకాక వ్యభిచారము, కామము, స్త్రీ విరోధము, భార్యా నష్టము, దంపతుల సౌశీల్యము, మూత్ర, గుద, మర్మాంగాది విషయములను, అన్య ప్రాంతములనుండి రాదగు ధన విషయములను తెలుసు కొనవచ్చును.

కళత్ర భావాధిపతి స్వక్షేత్ర, ఉచ్ఛ, మిత్ర క్షేత్రముల యందున్ననూ లేక కళత్ర స్థానమును శుభ గ్రహమును చూచినను, లగ్నాధిపతి బలవంతుడై ఉన్నరూప, గుణ, యవ్వన సంపన్నరాలగు భార్య ఉండును. అట్లుగాక సప్తమ భావాధిపతి పాప క్షేత్రముల యందు గాని, పాపులతో కూడిగాని పాపులతో చూడబడినను కళత్రభావము సామాన్య ఫలమును మాత్రమే ఇచ్చుననుట నిర్వివాదము.

కళత్ర భావాధిపతి యగు గ్రహము కళత్ర కారకుడగు శుక్రునితో కలసి పాప గ్రహ సంబంధంలేక యున్న తప్పక జాతకునకు గుణ శీలయగు భార్య కలిగి యుండును. 2,6,7, భావాధిపతులు శుక్రునితో చేరి లగ్న స్థాన మందుండి పాప గ్రహ యుక్తులయిన అట్టి జాతకుడు కామి అని అనవచ్చును. 1,2,6, అధిపతులు పాప గ్రహ యుక్తులై సప్తమ స్థానమందున్న అట్టి జాతకుడు పరస్త్రీ సంబంధము కలవాడని చెప్పవచ్చును. కళత్ర కారకుడగు శుక్రుడు పాపగ్రహముతో కలసి నీచరాశి యందుగాని, నీచ అంశ యందు కాని ఉన్న రెండు కళత్రములు అగును. కళత్ర భావాధిపతి కేంద్రమందుండి శుభ గ్రహములచే చూడబడుచున్న భార్య పతి భక్తిగల ఇల్లాలని గ్రహించుము.

ద్వితీయ స్థానమందు పాప గ్రహముండి ఏడింట కూడ పాప గ్రహము లుండి పాప గ్రహములచే చూడబడినచో మూడు కళత్రములగును. ద్వితీయమందు శని, సప్తమమున రాహువున్న జాతకునకు ద్వి కళత్ర యోగము సిద్ధించును. శుక్రుడు గురునితో చేరి సప్తమందున్న జీవ ద్వి కళత్వము సిద్ధించును. సప్తమున కుజుడు చంద్రునితో కలసి ఉండి లగ్నాధిపతి ఎనిమిదింట ఉన్న జాతకునకు త్రికళత్వ యోగముండును. లాభ సప్తమాధిపతులు కలసిననూ ఒకరి నొకరు చూచుకొన్ననూ, కోణములయందున్ననూ, బలవంతులై ఉన్ననూ, జీవించియున్న భార్యలు అనేక మందిని జాతకుడు కలిగియుండును.

కళత్రాధిపతి పంచమాధిపతితో చేరి లాభమందుండి తృతీయాధిపతిచే చూడ బడిన జాతకుడు ఐదు మంది భార్యలు కలవాడగును. కళత్రాధిపతి రవియై శుభ గ్రహములతో కలసికొని చూడబడినను శుభ నవాంశముల యందున్ననూ లగ్నాధి పతికి రవి మిత్రుడై ఉన్ననూ జాతకుని భార్య పతివ్రత అని గుర్తించుము.

కళత్రాధిపతి చంద్రుడై పాపగ్రహితు డైననూ, పాపగ్రహములతో చూడబడిననూ పాప క్షేత్రముల యందున్ననూ, పాప నవాంశముల యందున్న తప్పక జాతకుని భార్య అపరాధియు, కఠిన చిత్తురాలనియూ తెలియనగును.

కళత్రాధిపతి కంటే కళత్ర స్థానము కంటే ద్వితీయాధిపతి బలీయుడైయున్న యెడల సమాన జాతి, మంచి స్వభావము కలిగి భర్త యందు అనురాగ సేవాతత్పరత కలిగి

యుండును. సప్తమాధిపతి బుధుడై పాపగ్రహములతో కలసిననూ, పాపులతో చూడబడిననూ, పాప క్షేత్రములందు ఉన్ననూ వంశ నాశని యగు భార్యను కలిగి యుండును. ఒక పరి భర్తను చంపు దుర్మార్గురాలుగాను ఉండును.

సప్తమాధిపతి కుజుడై శుభులతో కలసిననూ, చూడబడిననూ, శుభ నవాంశల యందు కాని మిత్ర, స్వక్షేత్ర, ఉచ్చ క్షేత్రములందున్న భార్య క్రూర స్వభావము కలిగి యున్ననూ పతి అజ్ఞకు బద్ధురాలై మనగలదు. రాహుకేతువులు సప్తమ స్థానమునందుండి పాపులతో కలసి కాని, పాప నవాంశలయందు కాని ఉన్న యెడల జాతకురాలు దుర్మార్గురాలుగాను ఒక సమయమందు భర్తను వధించుటకు వెనుదీయరాని దుష్ట చిత్తము గల కింకిణి గాను ఉండగలదు.

శని కళత్రాధిపతియై శుభగ్రహములచే చూడబడిననూ, ధర్మ యుక్తయూ పరోప కారిగా యుండుననియూ ఆ శనిని గురువు చూచిన యెడల బ్రాహ్మణ భక్తి, దేవతా భక్తి కలిగి ఉత్తముడైన భర్తను కలిగి యుండును. రవి కళత్రాధిపతియై పాప గ్రహములతో కలసిననూ చూడబడిననూ, పాప నవాంశములయందున్న అట్టి జాతకుని భార్య సురాపానమందు అభిరుచి గల వనితయై యుండగలదు.

సప్తమాదిపతి శుక్రుడై పాప గ్రహము లతో కలసిగాని చూఢబడినగా నీచ, శత్రు క్షేత్రములయందు ఉన్న కాని పాప నవాంశలయందున్న అట్టి జాతకుని భార్య కఠిన చిత్తురాలయి వేశ్యగా ఉండుననుట శాస్త్ర నిర్దేశితము. సప్తమాధిపతిగాని, శుక్రుడుగాని, కుటుంబాధిపతి గాని 6,8,12 స్థానములయందున్న జాతకునకు ఆలస్యముగా వివాహము జరుగును. శుక్రుడు కేంద్ర, కోణములయందు గాని, సప్తమాధిపతి శుభరాశులయందుగాని, ఉన్న జాతకునకు బాల్యమునందు అనగా 16,17 సంవత్సరములకే వివాహము జరుగును.

లగ్న సప్తమాధిపతులు పరివర్తన గతులైన, అట్టి జాతకునకు 20 సంవత్సరములలో వివాహము జరుగును. రవి లగ్నమందు, శని సప్తమందు యున్న యెడల జాతకుని భార్య గొడ్రాలగును. రవిశనులు ఏడింట ఉండి గురుదృష్టి లేక చంద్రుడు దశమ కేంద్రమునందున్న జాతకునకు సంతతి కలుగుట సంశయాస్పదము. కుజుడు చతుర్థమున శని ఆరింటనున్న జాతకుని భార్య గర్భము దరించదు. ద్వితీయా సప్తమాధిపతులు ద్వితీయ సప్తమములయందున్న సహజ కళత్రములు 2,3 వరకు ఉండును.

శుక్రుడు బలయుతుడుగా ఉన్ననూ సప్తమాధిపతి బలయుతుడై గురుదృష్టి కలిగియున్ననూ జాతకునకు రెండు లేక మూడు జీవ కళత్రములు కలగి యుండును. సప్తమ భావాధిపతి యగు బుధుడు నీచ, శత్రు రాశులయందుగాని 6,8,12 భావములయందున్న అట్టి జాతకుని భార్య దుష్ట స్వభావి, ఒక సమయము భర్త హంతకి గాను ఉండుటకు ఆస్పదము గలదు.

సప్తమ, పంచమ భావాధిపతులు బలవంతులై శుభ గ్రహములతో కలసి యుండగా షష్టభావాధి పతి వీరలను చూచిన యెడల అట్టి జాతకునకు ఎందరు భార్యలున్ననూ సంతానము కలుగదు. కానీ, అన్య పురుషుని వలన సంతానవతి యగును. రవి ఏడింట ఉచ్చయందున్న యెడల స్త్రీ వియోగము కలిగి, చంచల స్వభావిగను, నలత శరీరముగల భార్యను కలిగి స్వల్ప సౌఖ్యమును అనుభవించును. సప్తమ

స్థానమున పూర్ణ చంద్రుడున్న పరస్త్రీలను పొందువాడుగను, మంచి రంగుగల దేహము గలవాడుగను ఉండును. ఆ చంద్రుడు క్షీణ చంద్రుడైన యెడల శరీర నలత కలిగి స్వల్ప సౌఖ్యమును పొందును. కుజుడు సప్తమ క్షేత్రమునందు నీచ శత్రుక్షేత్ర గతుడై యున్న కళత్ర నష్టము కలుగును. ఆ సప్తమము కుజునకు ఉచ్ఛ స్థానమై యున్న భార్య విరహి యగును.

సప్తమమందు రాహువు ఉండెనేని జాతకుడు కులాలతోనూ అనేక మంది స్త్రీలను రమించు వాడుగాను, నీచ స్త్రీల సంబంధము కలవాడుగనూ, ద్వికళత్ర యోగము కలిగి ఉండును. సప్తమ స్థానమందు గురువున్న జాతకుని భార్య పతివ్రతగాను, జాతకునకు స్త్రీ ధనమువలన విశేష సౌఖ్యము శాస్త్ర విషయములను తెలుసుకొనుటకు అనక్తి కవియూ సహా అయి ఉండగలడు. సప్తమమున శని ఉన్న యెడల జాతకునకు కళత్ర నష్టము గాని రోగియై గృహము లేక దుర్జన సహవాసిగా ఉండును.

కళత్ర స్థానమున బుధుడున్న జాతకుని భార్య సౌందర్యవతిగాను, సుశీలవతిగాను ఉండును. జాతకుడు విశేష ధన సంపత్తి, పుత్ర సంపత్తి కలిగి వైభవో పేతుడై సుఖియై వర్థిల్లును. సప్తమమున కేతువుండెనేని దైవభక్తి కల భార్య కలిగి ఉండును. భార్యయందు ప్రీతి కలవాడు గను, కాముడుగను, పాప కార్యములు చేయువాడుగను ఉండును. సప్తమమున శుక్రుడు ఉండెనేని అమిత ధన వంతుడు, పుత్ర సంతానము కలవాడు, గొప్ప వంశమునందు జన్మించిన వాడు, పేరు ప్రఖ్యాతులు కలవాడుగను ఉండును. ఇది గాక సౌందర్యవతుల పొందు కోరు జారుడుగను ఉండును.

సప్తమాధిపతి లగ్న, సప్తమముల యందున్న జాతకుడు దుష్టుడుగను, సమర్ధుడుగను, పరదార కామియై ఉండగలడు. సప్తమాధిపతి 6,8, భావము లయందున్న యెడల సుఖములకు దూరుడై తన భార్య రోగిష్టియై దుర్భర జీవితమును గడుపును. సప్తమాధిపతి ధన భాగ్య స్థానముల యందున్న స్త్రీలయందు విశేష ప్రీతి కలిగి దీర్ఘాలోచన, సదసత్ వివేకత్వమును కలిగి యుండును. సప్తమాధిపతి మాతృ, రాజ్య స్థానముల యందున్న జాతకుడు సత్య, ధర్మవాదియై పతివ్రతా లక్షణములు గల భార్యను కలిగి యుండును.

సప్తమాధిపతి పంచమ కోణము లందున్న జాతకుడు నిత్య సంతోషి, పూర్ణ ధనవంతుడై, సకల గుణాభిరాముడై సర్వులకు ప్రీతి పాత్రుడై మనగలడు.

సప్తమాధిపతి తృతీయ లాభముల యందున్న అనగా తృతీయ మందున్న మృతుడైన కుమారుడు, లాభము నందున్న జీవించి ఉన్న కన్య తరువాత పుత్రుడు కలుగును. సప్తమాధిపతి ద్వాదశ స్థానమున నున్న జాతకుడు దరిద్రుడుగను, అతని భార్య చోర బుద్ధి గల తుచ్ఛురాలై ఉండుట శాస్త్ర సమ్మతము.

పై స్థానముల యందున్న గ్రహములు, ఉచ్ఛస్థాన, నీచ, పాప స్థానములయందు ఉన్నవా గ్రహ దృష్టులను బాగుగా పరికించి యోచన చేసిన మంచి ఫలితములను సాధించవచ్చును.

సప్తమ భావ విచారణ చేయు సమయమున సద్బుద్ధి కలిగి భగవంతునిపై ధ్యానమును నిలిపి పవిత్రభావముతో పై విషయములను అకళింపు చేసికొని భగవత్ కృపకు పాత్రులు కండు.

## ఈ నెలలో మీ కర్తవ్యము

(21.5.1995 నుండి 20.6.1995 వరకు)

31.3.1995వ తేదీతో లెక్కలు ముగించిన అసెసీలు తాము రూ.2500/-లకు మించి వడ్డీ చెల్లించునపుడు పట్టుకొన్న పన్ను మొత్తాన్ని 31.5.1995వ తేదీ లోగా ప్రభుత్వ ఖజానాలో జమ కట్టాలి.

1994-1995 ఆర్థిక సంవత్సరములో ఆదాయము పన్ను విధింపునకు అర్హమగు ఆదాయము వచ్చు క్రొత్త అసెసీలు గత సంవత్సరము రూ.50,000/-లకు మించి ఆదాయము వచ్చి యుండియూ పర్మనెంటు నెంబరును పొందనివారు తమంతట తామే ఫారము నెం.40A ను పూర్తిచేసి అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి 31.5.1995వ తేదీలోగా చేరునట్లుగా పంపాలి.

మీరు పంపవలసిన A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు జూన్ నెల 20వ తేదీయే చివరిది. మీరు పంపు ఆ A-2 రిటర్నును చలానాతో బాటు కాకుండా, చెక్కుతో బాటు పంపాలను కుంటున్నారా? ఆ విధంగా ఆ A-2 రిటర్నును చెక్కుతోబాటు పంపుటను జూన్ నెల 15వ తేదీ లోగా చేయాలి.

## శ్రీ గుండా మాణిక్యం శ్రేష్ఠి గారికి భీమరథ శాంతి

కర్నూలు జిల్లా, బేతంచర్ల గ్రామ ప్రముఖులు శ్రీ గుండా మాణిక్యం శ్రేష్ఠి గారి భీమరథ శాంతి (సప్తతి మహోత్సవం) ని శ్రేష్ఠి గారి కుమారులు శ్రీ సత్యనారాయణ, శ్రీ వివేకానంద స్వామి, శ్రీ అశ్వర్థ నారాయణ గారలు 13.5.95 శనివారం నుండి 17.5.95 బుధవారం వరకూ పంచాహ్నిక దీక్షతో బేతంచర్ల లోని శ్రీ గాయత్రి శ్లాబ్ పాలిషింగ్ అండ్ మినరల్ ఇండస్ట్రీస్ ఆవరణములోని శ్రీ గుండా సత్యనారాయణ గారి నూతన గృహము 'శ్రీ పంచాయతనము'లో వైభవంగా జరిపించారు.

## చరిత్ర ప్రసిద్ధుడు తుంపూడి భగవంతం గుప్త

1921లో విశాఖ పట్టణమందు జరిగిన ఆర్యవైశ్య మహాసభలో సంఘ సంస్కరణలు (రజస్వలానంతర వివాహములు, విధవా వివాహములు) గురించి తీర్మానించగ, 1924లో గుంటూరు నందు జరిగిన ఆర్యవైశ్య మహాసభలో వానిని ఖండించగా, 1921లో సేలంలో జరిగిన ఆర్యవైశ్య మహాసభలో తిరిగి సంఘ సంస్కరణల గురించి ఏకగ్రీవముగ తీర్మానించి శ్రీ తుంపూడి భగవంతం గుప్త చరిత్ర ప్రసిద్ధు డయ్యెను.

చుండూరి అప్పారావు
రావెల. గుంటూరు జిల్లా.

# 'వాట్' ప్రాతిపదికగా అమ్మకం పన్ను విధింపు వర్తించు వస్తువులు

1. ఫోటోగ్రాఫిక్ మరియు ఇతర కెమెరాలు, ఎన్‌లార్జర్లు, కటకములు, ఫిల్ములు, ప్లేటు, కాగితము, అందుకు పనికివచ్చు ఇతర భాగాలు, ఉప సాధనాలు.
2. అన్ని గడియారాలు, టైము పీసులు, ఇతర వాచీలు, వాటి భాగములు.
3. ఫర్నిచరు.
4. నూలు చేసినవి, చేయనట్టివి అయిన హోజియరీ వస్తువులు, రెడీమేడ్ డ్రస్సులు.
5. అన్ని రకాల విద్యుత్ వస్తువులు, సాధనములు, ఉపకరణాలు, పనిముట్లు.
6. షీట్లు, కుషన్లు, మాట్రెసను, తలగడలు, రబ్బరు ప్లాస్టిక్ ఫోమ్, సింథటిక్ ఫోముతో చేసిన లేదా అటువంటి పదార్థాలతో చేసిన ఇతర వస్తువులు.
7. పెయింట్లు, రంగులు, డిస్టెంపర్లు, వార్నిషులు, బ్లాంకులు, సెల్యులోజు లేకర్లు, పాలిష్ పిగ్మెంట్లు, ఇండిగో ఎనామిల్స్, సిమెంట్ ఆధారంగా గల వాటర్ పిగ్మెంట్లు, ఆయిల్ బౌండు డిస్టెంపర్లు, వాటర్ పిగ్మెంట్లు, తోలు లేదా ప్లాస్టిక్ ఎమల్సన్ పెయింట్ల కొరకైన ఉత్పత్తులు, టర్పంటైన్ ఆయిల్, బేల్ ఆయిల్, వైట్ ఆయిల్, థిన్నర్లు, లిథో గ్రాఫిక్ ప్రింటింగు, డూప్లికేటింగ్ సిరాలు.
8. డైస్, రసాయనాలు.
9. స్టెయిన్‌లెస్ స్టీలు వస్తువులు.
10. కలప (దూలములు, వాసములు, పలకలుగా కోయబడిన దుంపలతో సహా)
11. రబ్బరు ఉత్పత్తులు.
12. నీటి సరఫరా, పారిశుద్ధ బిగింపులు, ప్రోల్సిలెన్ లేదా చినావేర్ కానట్టి ఇతరములు, రాతితో చేసిన పైపులు.
13. బేస్ మెటల్ లేక దాని మిశ్రమముతో చేయబడిన అన్ని హార్డ్ వేర్‌లు.

    గమనిక : ఈ అంశములోని వివరములకు గత ఏప్రెల్ *వైశ్యప్రబోధిని 35వ పుటలోని 14వ అంశమును చూచేది.*
14. స్టేపుల్ ఫైబరు, యార్న్.
15. పాదరక్షలు, ప్లాస్టిక్‌వి కానట్టి ఇతర పాదరక్షలు యాభై రూపాయలు, అంతకు పైబడిన ఖరీదు గలవి.
16. ప్లైవుడ్, పార్టికల్ బోర్డు, లామిన్ బోర్డు, లాటెన్ బోర్డు, గట్టి లేక మెత్తని వాల్ బోర్డులు, లేక ఇన్సులేటింగ్ బోర్డు

- కలప కాకుండా ఏదేని ఇతర పదార్థాలు
- కలిగియున్నవైనను .....

17. గ్లాసు, గ్లాసు వస్తువులు.
18. అన్ని రకాల పేపరు
(వివరములకు గత ఏప్రెల్ సంచిక 36వ పుట చూడు)
19. అన్ని రకాల సూట్ కేసులు, బ్రీఫ్ కేసులు, వ్యానిటీ బ్యాగులు.

గమనిక :

1. పై 19 రకాల వస్తువుల అమ్మకం పైన రాష్ట్రములో జరుగు రెండవ దశ, మఱియు ఆపై జరుగు అన్ని అమ్మకం దశల్లోనూ అమ్మకం విలువ మీద గల తేడాపై అమ్మకం పన్నును చెల్లించాలి.
2. 10 లక్షల రూపాయలకు లోపు టర్నోవరు గల డీలర్లును పన్ను విధింపు నుండి మినహాయించారు. అయితే అట్టి డీలరు అట్టి టర్నోవర్ 10 లక్షలు కూడ కేవలము వినియోగదారులకు మాత్రమే అమ్మినట్టిదై ఉండాలి. అయితే అట్టి డీలరు రాష్ట్రములో జరుగు మొదటి అమ్మకం దశలో అట్టి వస్తువుల టర్నోవర్‌పై పన్నును చెల్లించాలి.

**'వ్యాల్యూయాడెడ్ ట్యాక్స్' అనేది 'వాట్' యొక్క విస్తృత రూపం**

Licence No.50 POST WITHOUT PREPAYMENT
VYSYA PRABODHINI R.N. 15861/69. Postal Regd. No. H-CD-1

Printed, Edited & Published by P. Lakshmi Kantham Sreshty
M/s. Vasavee Printers, CUDDAPAH - 516 002. ✆ : 45025.